# భక్తబృందము

( 1 వ భాగము )

శాంతినిలయ గ్రంథమాల

ప్రొప్రైటర్:— ఆకురాతిచలమయ్య
కాకినాడ.

సర్వస్వామ్యములు
ప్రకాశకునివి

వెల
రు. 1—0—0

# విషయసూచిక

# భక్త బృందము

## 1 వ భాగము

—(ం)—

## 1 ఏకనాథ భక్తుడు

—(ం)—

గోదావరి తీరమున ప్రతిష్ఠానము లేక పైఠన అను నగరము ఉండెను. పైఠన్ మహారాష్ట్రులకు నవద్వీపము వంటిది. నవద్వీపము కలకత్తా రాజధానిలోనిది చైతన్యమహా ప్రభురొయొక్క జన్మస్థానము. అనేక శాస్త్రజ్ఞులు, పండితులు, అచ్చట వసించుచుండిరి. అనేకమంది విద్యార్థులుకూడా అచ్చట సమావేశమగుచుండిరి. పైఠన్. కేవలము విద్యాపీఠమేగాక దక్షిణదేశ వైష్ణవులకు ప్రసిద్ధ పుణ్యక్షేత్రముగా కూడ ఉండెను వైష్ణవ చూడామణి భానుదాసు, ఆయన ప్రపౌత్రుడైన ఏకనాథస్వామి పైఠనులో వసించిరి.

అల్పవయస్సునందే ఏకనాథునకు. ధర్మానురాగము కలిగెను. ఆయన బాల్యకాలములోనే తలిదండ్రులను పోగొట్టుకొనెను. పితామహుడు, పితామహికి తెలియ

జేయకుండ గృహమును వీడి దేవగిరి యందున్న సుప్రసిద్ధ
సాధువు జనార్దనస్వామి శిష్యత్వమును స్వీకరించెను. జనా
ర్దనస్వామి గృహస్థుడు, బాధ్యతాయుత కార్యములు
గావించువాడు.

గృహస్థాశ్రమమునకును, ధర్మావలంబనమునకును
ఎట్టి విరోధములేదని ఆయన తనజీవితముద్వారాచూపించెను
ఏకనాథుడు ఆయనకు యోగ్యశిష్యుడు.

గురువుగారి అనుగ్రహము, ఇష్టదేవత సాక్షాత్కార
మును బడసిన పిమ్మట ఆయన కొంతకాలము పుణ్యక్షేత్ర
ములలో సంచరించి పైఠనుకు తిరిగి వచ్చెను. అచ్చట గురు
వుగారి ఆదేశానుసారముగా వివాహము చేసుకుని గృహస్థు
డాయెను.

సాధారణ గృహస్థునకును ఆయనకును విశేషవ్యత్యా
సము ఉండెను. ఆయన బ్రాహ్మణవంశమునందు జన్మించి
నను కులభేదములు పాటించువారుకారు, వేదాంతశాస్త్ర
ములో విశేష పాండిత్యము సంపాదించినను విద్యాగర్వము
ఏమాత్రము లేకుండెను. వైష్ణవుని వలె వినయ సంపన్నుడు,
నాకేమియు విద్యరాదనియే నుడువువారు. సంస్కృత వ్యాక
రణములోని కఠిన నియమములు నాబుద్ధికి అతీతమైనవి.
సాధారణ ప్రజల హితముకొరకు ఆయన మరాఠీ భాషలో
గ్రంథములు రచించెను, కాని కవినని ఎన్నడును చెప్పుకొన
లేదు. ప్రతిదినము ఆయన గోదావరిలో స్నానమాచరించి

పూజాపునస్కారములు గావించువారు. మధ్యాహ్నము మూడుగంటలకు గృహప్రాంగణములో పురాణపఠనముగావించువారు అచ్చటికి సకలజాతులవారు వచ్చి పురాణపఠనమును వినుచుండువారు. రాత్రివేళ పొద్దుపోవువరకు సంకీర్తనములు జరుగుచుండెడివి. ఏకనాథుని కంఠము అతిరమ్యముగా ఉండెడిది. ఆయనలో గంభీరమైనభక్తి యుండెను, అసాధారణ కవిత్వశక్తి యుండెను. ఆయన మధురకంఠముతో పాటలు పాడునపుడు, విద్యావంతులైనను, అవిద్యావంతులైనను కన్నీరు కార్చుచుందురు.

ఆకాలములో ఆ బ్రాహ్మణులవద్ద శాస్త్రపఠనము నిషేధింపబడియుండెను, స్త్రీలు వేదపఠనముకూడ చేయతగదు. ఇతరజాతుల సంస్పర్శకూడ తగలరాదు.

ఏకనాథుని ధర్మాభిప్రాయములు అత్యంత సరళమైనవి ఆయన అతిథులను దేవతలనుగా పూజించువారు. సర్వజీవులలో నారాయణుడు ఉన్నాడని నమ్మెడివారు. భక్తిలేని బ్రాహ్మణునకు భక్తిగల శూద్రునికంటె తక్కువవాడనియే భావించువారు. ఆయన భక్తిని గురించి, ఆయన ఆదర్శములను గురించి, ఆయన ఉదార ధర్మమును గురించి యీదిగువ నుదహరించు కథలద్వారా బోధపడగలవు.

ఒకసారి వారము రోజులనుండిఎడ తెగక వర్షము వర్షించుచుండెను; వర్షములో ఎవరును బయటికి వచ్చుటలేదు.

కూరల సంతకూడ జరుగుట లేదు. గృహములో వస్తు వైశాల్యము ఉండెను, కాని వంటచెరకులు లేక అందరును యిబ్బందిపడుచుండిరి వర్షముచేత కట్టెలన్నియు తడిసి పోయెను. నిప్పు వెలిగించుటకు చాలా కష్టముగా యుండెను. ఇట్టి సమయములో అర్ధరాత్రి వేళ ముగ్గురు అతిథులు వచ్చిరి. ఎన్ని స్థానములలో సంచరించినను వారికి గుప్పెడు అన్నముగాని. ఉండుటకు ఆశ్రయముగాని లభించలేదు. ఊరు బయట ఏకనాథుడు ఉన్నాడు, ఆయన అతిథులను సత్క-రింతురు, అచ్చటికి పోయిన యెడల అన్ని యేర్పాటులు జరుగగలవని ఎవరో నుడివియుండిరి. వారి గృహములో మీ సేవకు లోటు ఉండదనిరి. అర్ధరాత్రి వేళ తడిసిన బట్టలతో ఆకలిగొన్న, దాహార్తులైన, అలసియున్న అతిథులు ఆయన గృహమునకు వచ్చిరి. ఏకనాథుని గృహములో కూడ ఎండుకట్టెలు లేకుండెను. ఆయన పరుండుమంచమును చీల్చి ఫెళ్లలుగా చేసెను. ఆ అర్ధరాత్రి వేళ ఆయన సతీమణి అతిథులకొరకు వేడినీళ్ళను కాచియిచ్చెను, అన్నము కూరలు తయారుచేసెను అతిథులు సంతృప్తిగా భోజనము చేసి, మార్గాయాసమును తీర్చుకుని పరుండి హాయిగా నిద్రించిరి,

ఏకులము వారైనను అతిథులైనంతమాత్రమున వారు దేవతలు, అతిథిసేవయందు జాతిభేదమును పాటించవలదు, ఇదియే ఏకనాథుని విశ్వాసము.

ఒకసారి పితృదేవుల వార్షిక శ్రాద్ధదినమున పట్టణములోని కొందరు బ్రాహ్మణ పెద్దలను భోజనమునకు ఆహ్వానించెను. భోజన సామగ్రిలు అన్నియు తయారయ్యెను. బ్రాహ్మణులు స్నానము చేయుటకు గోదావరికి పోయిరి, ఇట్టి సమయములో చింకి మురికి గుడ్డలు కట్టుకొనిన ముగ్గురు ముసలమానీ ఫకీరులు ఏకనాథుని గృహమునకు వచ్చిరి. వారు ఆకలిగొని యుండిరి, భోజనము కొరకు ప్రార్థించిరి. ఏకనాథుడు ఏమాత్రము సంకోచింపక శ్రాద్ధముకొరకు తయారు చేయబడియున్న అన్నమును ఆయన స్వహస్తముతో వడ్డించెను. వారి ఆహారము పూర్తి అయినపిమ్మట స్వహస్తముతో తాంబూలము తయారుచేసి యిచ్చెను. ఆ అతిథులు తిరిగి పోవుచున్నపుడు బ్రాహ్మణులు వచ్చిరి. ఏకనాథుని వ్యవహారముచూచి వారు కోపగించిరి, ఈతనికి ఎంత అహంకారము, శ్రాద్ధముకొరకు తయారుచేసిన అన్నము బ్రాహ్మణులకు పెట్టకుండా ముందుగానే మ్లేచ్ఛులకు వడ్డించినాడు. ఈతడు దేవద్విజుల గౌరవమును నిలుపజాలకున్నాడు అని నిందించిరి. ఏకనాథుడు వినయపూర్వకముగా, "తమరు కోపగింపకుడు, వీరు అతిథులు, వండిన అన్నము వాసనపట్టి వచ్చినారు, ఆ వాసన తగిలిన ఎంగిలి అన్నము తమకు వడ్డించజాలను, అందువలన వారికి వడ్డించితిని. వారు అధికముగా క్షుధార్తులై యున్నారు. తమరు కొంచెముసేపు వేచియుండుడు. తమకొరకు వంట అగుచున్నది. ఎక్కువ ఆలస్యముకాదు. బ్రాహ్మణులు ఏకనాథుని వినయ ప్రార్థన

మును వినలేదు, ఆయనను నిందించుచు వెడలిపోయిరి. దీని వలన ఏకనాథుని చిత్తము ఏమాత్రము చలింపలేదు.

ఏకనాథుని గృహమునకు అతిథులుగా వచ్చిన ముసలమానులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని ఒక కవీశ్వరుడు వర్ణించెను. ఇతరులు ఎవరు గ్రహింపక పోయినను, భక్త శ్రేష్ఠుడగు ఏకనాథునికి వారి పరిచయము తెలిసియే యుండెను. అభ్యాగతులగు ఫకీరులను అతిథులుగా భావించియే వారికి దేవతల గౌరవము యిచ్చెను.

ఏకనాథుని అతిథిసేవ, సహనశక్తి విషయములో ఒక బ్రాహ్మణుడు పరీక్షించెను. బ్రాహ్మణుడు కన్యాదాయగ్రస్తుడు. భిక్షాటనవలన కొంత ధనమును సంపాదించెను, ఇంకను రెండువందల రూపాయలు ఆయనకు అవసరము. ఈ ధనముకొరకు ఆయన పైఠన్ నగరమునకు వచ్చెను. ఆయన నగరములో ప్రవేశించిన వెంటనే యిద్దరు దుర్మార్గులు ఆయన వెంటబడిరి, ఏకనాథుని అందరు భక్తితో గౌరవించువారు, ప్రేమతో పూజించువారు, అందువలన కొందరు ఆయనకు శ్రమ కలుగచేయుచుందురు. ఒకపనిచేసిన యెడల రెండు వందలరూపాయలు మేము యిచ్చెదమని ఆ బ్రాహ్మణునితో నుడివిరి. ఈ పూరిలో ఏకనాథుడని ఒక బ్రాహ్మణుడు వున్నాడు. ఆయనకు ఎవరు కోపముకలుగచేయ లేకున్నారు. మీరు ఆయనకు కోపము వచ్చునట్టుల చేసినయెడల రెండువందల రూపాయలు యిచ్చెదమని వాగ్దానము చేసిరి,

బ్రాహ్మణుడు అమాయికుడు. ధనాశచేత ఏకనాథుని సహనశక్తి, సాధుత్వమును పరీక్షింప సమ్మతించెను. ఏకనాథుడు స్నానముచేసి దేవతాగృహములో పూజగావించుకొను చుండెను, ఇంతలో ఆ బ్రాహ్మణుడు వచ్చి ఎగిరి తొడపై కూరుచుండెను. అపరిచితునిద్వారా పూజకు భంగము కలిగినపుడు సహించి ఉండుట అందరికిని సాధ్యము కాదు, కాని ఏకనాథునకు కోపము కలుగనేలేదు, పైగా బ్రాహ్మణునకు నమస్కారములు అర్పించెను. దేవతా, నాపై నీకు ఎంతదయ! నీవు అతిథివి, నాగృహమునకు వచ్చి నన్ను ధన్యునిగా జేసితివి. నా స్వాగతము కొరకు నీవు వేచి యుండలేదు, నాదోషము మన్నించి నీవే నన్ను కౌగలించుకొనుటకు వచ్చితివి.

దీనివలనకూడ అతనికి కోపము రాలేదు. మరియొక పనిచేసిన యెడల యీయనకు కోపము రావచ్చునని తలంచెను. భోజనముకొరకు ఆ బ్రాహ్మణుని వెంటబెట్టుకొని ఏకనాథుడు వంట శాలలో ప్రవేశించెను. అతిథికి అన్నము వడ్డించుటకు ఆయనసహధర్మిణి వచ్చెను. ఆమెవడ్డించ బోవు సమయమునకు ఆ బ్రాహ్మణుడు ఆమెవీపుపై ఎక్కి కూరుచుండెను. దానివలన కూడ ఏకనాథుడు కోపపడలేదు. సహధర్మిణితో నుడివెను—జాగ్రత, కదిలిన యెడల బ్రాహ్మణుడు పడిపోయి దెబ్బతినవచ్చును. రాణుబాయీ ఏకనాథుని యోగ్యురాలగు ధర్మపత్ని. ఆమెచిరునవ్వుతో యిట్లుల నుడివెను—మన అబ్బాయిని వీపుమీద ఎక్కించుకుని తిరిగే

అలవాటు ఉన్నదిగదా, భయములేదు, నాకు ఎట్టి యిబ్బంది యులేదు. ఈ సాధు దంపతుల ప్రవర్తనకు మెచ్చుకుని, అత్యంత లజ్జితుడై క్షమాపణ కోరుకుని జరిగిన వృత్తాంత మంతయు వెల్లడిచేసెను. ఏకనాథుడు నవ్వుకొని, 'అయ్యో, యీ సంగతి ముందుగా చెప్పకపోతివే, చెప్పినయడల కోపగించెడివాడను, నీకు రెండువందల రూపాయలు లభించెడివి'. అనెను.

ఏకనాథుడు ప్రతి అతిథిని దేవతగా భావించువారు, సర్వజీవులయందు నారాయణుడు ఉన్నటుల విశ్వసించువారు ఒకసారి ఆయన తీర్థయాత్రకు బయలుదేరెను. ప్రయాగ నుండి గంగాజలము తీసుకుని రామేశ్వరమునకు ప్రయాణము చేయుచుండెను. అచ్చట ఆ పవిత్రనీరముచే రామేశ్వరములో శివునకు అభిషేకముచేయ సంకల్పించుకొనెను. రామేశ్వరము సమీపమునకు వచ్చెను సమీపమున ఒక గాడిద వేడియిసుకపై బడి దాహముచే తన్నుకొనుచున్నటుల ఏకనాథుడు చూచెను, ఎంతయో శ్రమతో, శ్రద్ధతో శివుని అభిషేకముకొరకు తెచ్చుచున్న గంగాజలమును ఆముమూర్ఖ గార్దభమునకు త్రావించెను. ఆయనతో ఉన్నవారు విచారముతో, "ఛీ, ఛీ, ఇంతదూరమువచ్చి తుదకు తీర్థయాత్ర వృథా అయిపోయెనే" అనెను. నేను యిక రామేశ్వరము వరకు వెళ్ళవలసిన పనిలేదని ఏకనాథుడు నవ్వుచు నుడివెను. ఇచ్చటనే నా తీర్థయాత్ర సఫలీకృతమైనది. భాగీరథీజలమును నారాయణునకు సమర్పించుకొంటిని" అనినుడివెను.

ఏకనాథుని పాటలు వినుటకు సకలజాతులవారును వచ్చువారు. పైఠాన్ నగరములో రాన్యా అను మహార్ జాతీయులు వసించుచుండురు, మహారులునీచజాతీయులునగరములో వసించుటకు వారికి అధికారములేదు. స్పర్శించుట అలావుండగా, మహారుల నీడకూడా బ్రాహ్మణునకు తగుల కూడదు. రాన్యా ప్రతిరోజు తనభార్యను వెంటబెట్టుకొని ఏకనాథుని కీర్తనము వినుటకు వచ్చువారు. బ్రాహ్మణులు, ఉన్నత జాతివారు కూరుచున్న స్థలమునకు పోవుటకుకూడ వారికి సాహసము ఉండెడిది కాదు. ప్రాంగణమునకు బయట ఒకస్థానమునందు కూరుచుని, చేతులు జోడించుకుని, దీన భావముతో భక్తుడు భక్తవత్సలుని కీర్తించుట విని ధన్యు డగు చుండెను. ఆనాడు ఏకనాథుడు శ్రీకృష్ణుని విశ్వరూప మును గురించి చెప్పుచుండెను—సహస్రబాహువులు, సహస్రపాదములు, సహస్రశీర్షములుగల భగవానుని దేహమునందు సమస్త చరాచరము ఉన్నటుల, దేవతలు, గంధర్వులు,యక్ష రక్షకులు, పశుపక్షులు, అన్నియు ఆ దేవదేహములో వసించుచున్నటుల అర్జునుడు దర్శించెను.

భగవానుడు విశ్వరూపమును ధరించి నపుడు యీ పాపిష్ఠరాన్యా ఎచ్చట ఉండెను" అని రాన్యా వ్యాకుల హృదయముతో ప్రశ్నించెను. నీవా ? "నీవుకూడా ఆ విశ్వరూపమునందే ఉంటివి" అని ఏకనాథుడు జవాబు చెప్పెను. రాన్యా సంశయములన్నియు తొలగిపోయెను. ఆతడుకూడ భగవానుని అంశము, ఆతడుకూడ దేవత,

ఆతడు తుచ్ఛుడు కాడు, నీచుడు కాడు, ఆతనిలో నారాయణుడు ఉన్నాడు. భగవానుని విశ్వమునందు ఆతనికికూడ స్థానమున్నది, భగవానుడు తన విశ్వరూపమునందు అధముడైన రాన్యాకుకూడ ఆశ్రియము యిచ్చినాడు.

కొంతకాలమునకు రాన్యాభార్య స్వయముగా వంట చేసి ఏకనాథునకు విందుచేయ చేయవలెనని తలంచెను. ఇది సాధ్యమగు విషయమా? ఏకనాథుడు బ్రాహ్మణుడు. రాన్యా నీడ తగిలినంతనే స్నానము చేయవలసి యుండును, ఆయన అస్పృశ్యుల గృహములలో భోజనము చేయుదురా? కాని అస్పృశ్యుడనైన నాలోకూడా దేవుడున్నాడని ఆయన చెప్పి ఉన్నారుగదా? ఆయన మాకోరికను నెర వేర్చరా? ఒక రోజున రాన్యా మిక్కిలి భయముతో ఏకనాథుని వద్దకు పోయి ఆతని భార్యయొక్క కోరికను తెలియజేసెను. మీరు యిద్దరును సదాచారులగు విష్ణుభక్తులు, మీగృహములో నేనుభుంజెదను. ఏకనాథుడు తన వాగ్దానమును నెర వేర్చకొనెను, సాంఘిక దండనముకూడ అనుభవింపవలసివచ్చెను.

రాన్యా గృహములో ఏకనాథుడు భుజించుననువార్త పట్టణములో వ్యాపించెను. పూర్వాచార పరాయణులు కోపావేశులయిరి. నియమిత సమయములో రాన్యాగృహమునందును, ఏకనాథుని గృహమునందును ఏకనాథుడు భుజించుచున్నటుల బ్రాహ్మణులుగాంచి భక్తుని లీలలకు మెచ్చ

కొనిరి, భగవానుడు భక్తాధీనుడై యుండి భక్తునిరక్షించును.

పైఠానుగ్రామసమీపములో ఒకదరిద్రవ్యక్తికి చెవిటి మూగ అయిన కుమారుడు ఉండెను, అతనికి తెలివికూడా లేదు, తిండిబోతు, దరిద్రునకు ప్రతిరోజు ఫలహారములు ఎచ్చటనుండి లభించగలవు? ఏకనాథుని భక్తులు ఆతనికి ప్రతిరోజు వివిధములైన ఫలహారములను యిచ్చుచుండిరి. భక్తుల దానము వల్లనే ఏకనాథుడు అతిథులసేవ చేయుచుండెను. ఒకరోజున ఆ బాలకుని తల్లి తన మూగకుమారుని తోడ్కొని వచ్చి " నేను బీదదానిని, యీ పిల్లవానికి ఆహారము పెట్టుట నాకుసాధ్యము కాకున్నది " అనెను. " నేటి నుండి యీ పిల్లవాని భారము నేను వహించుచున్నానని " ఆయన నుడివెను. ఈతనిని యిచ్చట ఉంచుము. బాలకుడు క్రమముగా ఏకనాథునకు ప్రియతమశిష్యుడాయెను, మాటలు నేర్చుకొనెను, విద్యలో ఆరితేరెను, ఏకనాథుడు అసంపూర్ణముగా వదలిన రామాయణమును సంపూర్ణము చేయగల శక్తిశాలి ఆయెను.

ఏకనాథుడు జనసమూహములో జనార్దనుని దర్శించెను. నరులలో నారాయణుని వీక్షించెను. అందువలననే ఆయన అస్పృశ్యుల గృహములలో భుజించెను, శ్రాద్ధాన్న

మును ముసలమానులకు వడ్డించెను, ఆశ్రితులగు దొంగలను రక్షించెను, సర్వజీవులలో శివస్వరూపుని దర్శించెను. అందుచేతనే రామేశ్వరమునకు తీసుకొని పోవుచున్న గంగాజలమును గాడిదకు త్రావించెను. జీవులసేవను దేవుని సేవగా భావించెను.

---

## 2 చైతన్య భక్తుడు

ధర్మ ప్రపంచములో విచిత్రలీలను కానుపించుచుండును. దేశములో ధర్మమునకు వినాశము కలుగుచున్నపుడు అద్భుతశక్తితో మహాపురుషులు జన్మించుచుందురు. బెంగాలు దేశమునందు ఒకప్పుడు అత్యంతశోచనీయమైన పరిస్థితులు సంభవించెను. ప్రజలు ఉన్నత ధర్మమార్గమును గురించి మరచిపోయిరి, వేదార్థమును గ్రహింపలేక భక్తిశూన్యులై చరించుచుండిరి. ప్రజలు దేవునిగురించి తలంచెడివారు కారు, ధర్మానుష్ఠానములలో ప్రేమకు, భక్తికి స్థానము లేకుండెను, ఆయుగములో ప్రజలు దేవతలను కొలుచువారు, పూజానుష్ఠానములో ఆడంబరముత్రే ప్రాధాన్యత

వహించెను భగవానునియందు యథార్థభక్తి లోపించెను.

వంగదేశము భక్తివిహీనమై ధర్మముపేరుతో వివిధ అనాచారములు ప్రబలి, దేశము కుప్పించి యుండెను, ఆధ్యాత్మిక అలసత్వముచేత దేశము నిర్జీవమై యుండెను, ఆసనుయములో భక్తికి అవతారమైన శ్రీచైతన్యుడు ఆవిర్భవించెను. చైతన్యదేవుని జీవితచరిత్రలు " చైతన్యచరితామృతము " నందును, " చైతన్యభాగవతము " నందును యిటుల వ్రాయబడియుండెను—" ప్రేమను, భక్తిని నేర్పుటకు ఆయన అవతరించెను భగవానునియెడల ప్రేమ. భక్తి కలిగియుండుడని " బోధించుటకే వంగదేశమునందు చైతన్యుడు ఉదయించెను.

చైతన్యుడు ఆవిర్భవించుటకు ముందు రామానుజ రామానంద, కబీరు, నానక, దాదూ మొదలగు భక్తబృందము దేశవాసుల హృదయక్షేత్రములను కొంతవరకు తయారుచేసి యుంచెను. వీరు అందరును దేవుడు ఒక్కడేయని ప్రచారము చేసిరి, జాతిభేదమను మహాపాపమును యీదేశమునుండి తొలగించుటకును, ప్రజల మనస్సులను ఉదారముగను, సంస్కార విముక్తముగను గావించుటకును వారు మహత్తర సందేశములను ప్రచారము చేసి యుండిరి. వంగదేశమునందున చైతన్యదేవుని ఆవిర్భావమునకు ముందునుండియే భక్తివాయువులు వీచుచుండెను.

పతితమానవ సంఘమును ఉద్ధరించుటకు కొందరు సాధకుల బద్ధపరికరులైరి, శ్రీవాసు హరిదాసు మొదలగు సాధ

కులు. అప్పటినుండి శాంతిపుర భక్తుడును సాధకుడునైన అద్వైతగోస్వామి నలువైపులచేరి కొంచెముగా భగవత్ ప్రేమను ప్రచారము చేయుచుండిరి. నాలుగువైపుల ధనాడంబరములు, ఉపదేవతల ఆరాధనము, మూఢవిశ్వాసములో ప్రాధాన్యము చూచి అద్వైతాచార్యుడు విశేషముగా ఆవేదనము ననుభవించుచుండెను, పతితమానవ సంఘమును ఉద్ధరించు ఉద్దేశముతో భగవానునివద్ద ప్రార్థించుచుండెను.

దేశపరిస్థితులు యీ విధముగా ఉన్నపుడు ఆచార్యుని క్షుద్రభక్త మండలి నిర్జనమునందు ప్రేమపూర్వకముగా, వ్యాకుల హృదయముతో భగవానుని ఆరాధనయందు నిమగ్నమైయుండెను. అద్వైతాచార్యుని శిష్యమండలిని గురించి వినినకొందరు దుర్మార్గులు వారిని నిరసనతో చూచుచు వారిపై అత్యాచారములు గావించుచుండిరి. దుర్మార్గులు వారి గృహములనుసహా బద్దలు చేయసంకల్పించుకొనిరి.

ఇట్టి సమయములో చైతన్యదేవుడు జన్మించెను, ఆ కారణముచేతనే ఆయనను యుగావతార మందురు.

చైతన్యదేవుడు ఆవిర్భవించి ఆయనప్రేమ, భక్తిబీజములను నాలుగువైపుల వ్యాపింపచేయుటచే, అవి అంకురించి, పల్లవించి, పుష్పించి శోభాయమానముగా ఉండెను. ఆధ్యాత్మిక దారిద్ర్యముచేత పీడింపబడుచున్న ప్రజలు ఆ దివ్యఫలములను అనుభవించిరి, రక్షింపబడిరి వసంతకాలము సమీపించినపుడు మలయమారుతములు ప్రవహించుచుండును, వనములలో కుసుమములు వికసితము లగుచుండును, అరణ్యము

లలోను, పర్వతములలోను ఉన్న వృక్షలతాదులు నవనవ పత్రములతోను ముకుళములతోను విరాజిల్లుచుండును, తృణముసహా నూతనజీవితమును బడసి నూతనశోభను చేకూర్చుచుండును. కోకిలములు వసంతకాల ప్రవేశమును గాంచి స్వాగత సంగీతములను పాడుచుండును, అటులనే చైతన్యుని ఆవిర్భావమువలన భక్తిశూన్యదేశమునందు భక్తి ఆవిర్భవించెను ఈశ్వరభక్తి వ్యాపింప జొచ్చెను.

చైతన్యదేవు ప్రచారముచేసిన ధర్మమునకు ప్రాణము రాధాకృష్ణభక్తి. విష్ణు లేక శ్రీకృష్ణుని మహిమను ప్రచారము చేయుట చైతన్యుని ధర్మమై యుండుటచే ఆయన ప్రచారముచేసిన ధర్మము వైష్ణవధర్మము, చైతన్యదేవు శ్రీకృష్ణుని నామకీర్తనము చేయుచు సమస్తవంగదేశమునందు సంచారము చేసియుండెను. తత్ఫలితముగా భక్తిశూన్యమైన యీ దేశములో భక్తిప్రవాహము ప్రవహించెను. చైతన్యదేవుని కృష్ణభక్తి అత్యంతప్రగాఢమైనది. దానిని గాంచియే ఆయన భక్తులు భక్తిమహిమను గ్రహించిరి. శ్రీకృష్ణునిరూపముతో పోలికయున్న వస్తువులను చూచి ఆయన విమోహితుడగుచుండువాడు, ఆయనభక్తి అంత ప్రగాఢముగా యుండెను. కాళిందీజలముగాని, యమునా జలముగాని, మయూర కంఠముగాని, తమాల వృక్షములు గాని—ఇవి శ్రీచైతన్యునకు ఆయన ఆరాధ్యదేవతను గురించి జ్ఞప్తికి తెచ్చెడివి. సముద్రతరంగములను చూచి యమునా నది జలమని భ్రమపడువాడు. ఆ నీలజలరాశిని చూచిన

పుడు ఆయన ఆరాధన దేవతయొక్క నీలనవఘన శరీరకాంతి స్మరణకు వచ్చెడిది. ఏనదిని చూచినను వెంటనే యమునా నదియని భ్రమించెడివారు.

మయూర కంఠమునగల నీలవర్ణమును గాంచినంతనే శ్రీకృష్ణుని విషయమే ఆయనకు స్మరణకు వచ్చెడిది, భక్తి ఆవేశముతో మూర్ఛ చెందువారు.

నీలమేఘములు, తమాలవృక్షములు శ్రీకృష్ణుని గురించియే స్మరింప జేసెడివి.

ఆయన భగవద్భక్తిలో తన్మయుడై ఈశ్వరప్రేమ మహిమను ప్రచారము చేసెను.

చైతన్యుడు 1485 వ సంవత్సరములో ఫాల్గుణపౌర్ణమిరోజున జనన మొందెను. చైతన్యుని తండ్రిపేరు జగన్నాథ మిశ్రి, తల్లిపేరు శచీదేవి, వీరి ఆదిమ వాసము శ్రీహట్టఅను నగరములో యుండెను, జగన్నాధుడు విద్యకొరకు శ్రీహట్ట నగరమునకువచ్చి అచ్చటనే సంసారమును స్థిరపరచుకొనెను. ఆకాలములో నవద్వీపము విద్యాపీఠముగా ప్రసిద్ధిబడసి యుండెను. వంగదేశమునుండి అనేకమంది విద్యార్థులు అచ్చటికి వచ్చుచుండిరి. జగన్నాథుడుకూడ వచ్చెను.

ఈ నవద్వీపములోనే చైతన్యుడు జన్మించెను. చైతన్యుని పేరు అసలుపేరుకాదు. అసలుపేరు విశ్వంభరుడు. ఈయనకు యింకను కొన్ని పేరులు గలవు— గోరాచందు, గౌరాంగ, నిమాయ్ మొదలగునవి. ఈయన దేహకాంతి

సువర్ణవర్ణముగా యుండుటచే గోరాచంద అని, గౌరాంగ అని పిలువబడుచుండెను.

చైతన్యునకు అన్నగారు ఉండిరి. ఆయనపేరు విశ్వరూపము తలిదండ్రులకు స్నేహపాత్రుడు. ఈయనకూడ సుందరమైనవాడు, బుద్ధిమంతుడు మేధావంతుడు. విద్యయందు విశేష అనురాగము ఉండెను. ఈబాలుడు అద్వైతాచార్యుని వద్ద వేదవేదాంతములు అభ్యసించి పదునారు వత్సరముల వయస్సులో సంస్కృత శాస్త్రములందును, దర్శనశాస్త్రములందును విశేషపాండిత్యము గడించెను. ఈ సమయములో యీతని వివాహమునకు యేర్పాటులు గావించిరి. కాని విశ్వరూపుడు గృహస్థుడగుటకు యిష్టపడలేదు. ఆయన ఒకరోజున ఎవరికిని చెప్పక గృహమును వీడి వెడలిపోయెను.

విశ్వరూపుడు అంతర్ధానమై పోవుటచే జగన్నాథునకు భయముకలిగెను. పదిఆరు సంవత్సరములలో విద్యావంతుడైన ఫలితముగా విశ్వరూపుడు సన్యాసిఅయి పారిపోయెను, చైతన్యుడుకూడ విద్యావంతుడైన సన్యాసిఅయి గృహమును వదలి పారిపోవునేమోనని జగన్నాథుడు భీతిచెందెను. ఆ కారణముచేత అయిదుసంవత్సరములు వయస్సుగల చైతన్యుని చదువు మానిపించెను.

చదువు మానిపించి కారణముచేత చైతన్యుడు అనేక విధముల అల్లరులు చేయుచుండెను. గంగాతీరమునకుపోయి

పూజారులైన బ్రాహ్మణులను బాధించుచుండెను. కొందరు నీటిలో నిలువబడి జపముచేసుకొనుచుందురు, ఆసమయములో చైతన్యుడు నీటిలోమునిగి ఆ జపము చేసుకొనుచున్న వారికాళ్ళుపట్టుకుని లాగుచుండెను. కొందరు శివలింగమును ముందుపెట్టుకుని కండ్లుమూసుకుని జపముజేయుచుందురు, ఆ సమయములో చైతన్యుడు శివలింగమును తీసుకుని పారిపోవు వాడు, కండ్లుతెరచి చూచుసరికి శివలింగము లేకపోవుటచే పూజారులు ఆశ్చర్య మొందెడివారు. కొందరి కండువాలను లాగితీసుకొని పోవువాడు, కొందరివి పూజాపుష్పములు తీసుకొని పారిపోవువాడు. ప్రజలు స్నానము చేయబోవునపుడు వారిదుస్తులను గంగాతీరమున ఉంచెడివారు, చైతన్యుడు ఎవరికిని తెలియకుండా ఆ దుస్తులను తీసుకొని పారిపోవువాడు. కొందరిదుస్తులను దాచిపెట్టి పారిపోవువాడు, పొరుగుయింటివారి గృహములలో కూడ అల్లరి చేయుచుండెను.

బాలకుడైన నిమాయ్ చేయుచున్న అల్లరికి నవద్వీప వాసులు విరక్తిచెందిరి. విద్య నేర్పించమని ప్రజలు తలిదండ్రులతో చెప్పిరి. చైతన్యుడు మరల పాఠశాలలో ప్రవేశించి చదువుచుండెను.

విష్ణుదాసు, సుదర్శన, గంగాదాసుగార్ల విద్యాలయములలో విద్యనభ్యసించెను అల్పవయస్సులోనే సంస్కృత వ్యాకరణము, అలంకారము, న్యాయశాస్త్రములలో విశేష

పాండిత్యమును సంపాదించి ప్రసిద్ధిబడసెను. చైతన్యుడు తాను విద్యపూర్తి చేసి స్వయముగా ఒక విద్యాలయమును స్థాపించెను. అతనికి అప్పుడు పదినేడుసంవత్సరముల వయస్సు. ఆయన పాండిత్యము దేశవిదేశములలో వ్యాపించెను. ఆయన విద్యాలయములో విద్య నేర్చుకొనుటకు అనేక దేశములనుండి విద్యార్థులు వచ్చుచుండిరి.

ఈ సమయములో కేశవకాశ్మీరు అనుపేరుగల ప్రసిద్ధ పండితుడు నవద్వీపమునకు వచ్చెను. అచ్చటి పండితులను అందరిని తర్కయుద్ధమునకు ఆహ్వానించెను. కేశవకాశ్మీరు అఖండ పండితుడు ఆయన అనేక దేశములలో అనేకమంది పండితులను తర్కయుద్ధములో ఓడించెను. ఈయన రాక వలన నవద్వీప వాసులు భయపడిరి.

కాని చైతన్యుడు నవద్వీప గౌరవమును నిలుపగలిగెను. ఈయన యిదివరకే అనేకమంది పండితులను ఓడించెను. నవద్వీపవాసులు యీపండితునితో వాదించలేక ఆయనను చైతన్యదేవునివద్దకు పంపిరి.

చైతన్యదేవుడు అప్పుడు భాగీరథీతీరమున కూరుచుని శిష్యులతో వివిధములైన ఆలోచనము నుగావించుచుండెను. కేశవ కాశ్మీరు అచ్చటికిపోయి ఆయన వాదింప జొచ్చెను. గంగానది శోభను వర్ణించుచు కొన్ని చక్కనిశ్లోకములను రచించి చైతన్యుని ఆశ్చర్యపరచుటకు ప్రయత్నించుచుండెను

చైతన్యుడు ఆశ్లోకములలోని ప్రతిపదమునందున్న అలంకార దోషములను, వ్యాకరణ దోషములను చూపి కేశవుని గర్వము చూర్ణముచేసెను. ఈతరుణ చైతన్యునివద్ద ఓడిపోయి సిగ్గుచే తలవంచుకుని మారుమాటాడక అచ్చటినుండి అదృశ్యమై పోయెను.

ఈ సంఘటన జరిగిన కొంతకాలమునకు చైతన్యుని తండ్రి పరలోకగతుడాయెను. పితృదేవుని మరణానంతరము చైతన్యుడు శిష్యులను వెంటబెట్టుకుని వంగదేశములో వివిధ ప్రదేశములందు సంచరించెను. దేశసంచార ఉద్దేశముతో కాక, జ్ఞానప్రచారముకొరకు దేశసంచారము గావించెను. ఈ సంచారము ముగించి స్వగృహమునకు తిరిగివచ్చి పాము కాటువలన తనసతీమణి లక్ష్మిదేవి మరణించినటుల తెలిసికొనెను. కొంతకాలమునకు విష్ణుప్రియ అనుపేరుగల మరియొక బాలికను వివాహము చేసికొనెను.

చైతన్యుని దినములు కొంతకాలము సుఖముగా గడిచెను. ప్రథమభార్య మరణించిన పిమ్మట ఆయనలో కొంత మార్పు కలిగెను. ఇంతకుపూర్వము ఆయన హాస్యప్రియుడును, చంచలమతియునై యుండెను. కాని హఠాత్తుగా ఆయన మనోభావములన్నియు మారిపోయి గంభీరప్రకృతి గలవాడయ్యెను.

ఈ సమయములో ఆయన మాతృదేవి ఆదేశమును బడసి పితృపిండ దానమునకై గయాధామమునకు వెడలిపో

యెను. దారిలో ఈశ్వరపురి అను ఒక మహాభక్తుని దర్శనము ఆయనకు లభించెను. ఈశ్వరపురి యందున్న భక్తిని చూచి చైతన్యునకుకూడ భక్తిభావము, ధర్మభావము హృదయములో జనించెను. ఇంతకుపూర్వము ధార్మికవిషయములను గురించి పరిహాసము చేయువాడు. ఈశ్వరపురి రచించిన ఈశ్వరభక్తి విషయకశ్లోకములనుండి ఎన్నియో దోషములను చూపించుచుండువాడు. కాని ఈసారి ఈశ్వరపురిభక్తిని స్వయముగా దర్శించుటచే ఆయన మనోభావములు సంపూర్ణముగా మారిపోయెను. ఆయన ఈశ్వరపురికి శిష్యుడాయెను. ఈశ్వరపురివద్ద కృష్ణభక్తి నభ్యసించెను, కృష్ణభక్తిచేఆయన మనస్సు, హృదయము పరిపూర్ణమై పోయెను ఆయన నవద్వీపమునకు తిరిగివచ్చెను.

తీర్థయాత్రకు పూర్వపు చైతన్యుడు, అనంతర చైతన్యుడు వేరైయుండెను, పూర్వము ఆయన విశేషపరిహాసప్రియుడై యుండెను. పరిహాసములతో, హాస్యరసముతో, విద్యాబోధముతో దినములు గడచుచుండెడివి. గయనుండి తిరిగివచ్చిన పిమ్మట ఆయన బాహ్యజ్ఞానశూన్యుడై శ్రీకృష్ణధ్యానములో నిమగ్నమై యుండువారు.

శ్రీకృష్ణునియెడల కలిగినప్రేమ, భక్తివలన ఆయన పిచ్చివానివలె మారిపోయెను భగవానునివిషయము ధ్యానించుచు సమస్తమునుమరచిపోయెను. శ్రీకృష్ణునినామము స్మరించినంతనే కన్నీరు కార్చువాడు. శ్రీకృష్ణుని కీర్తనలుపాడుచు

తన్మయత్వము చెందువాడు, భగవానునితో ఏకమైపోయి నటుల తలంచెడివాడు.

చైతన్యునిలో కలిగిన యీమార్పును చూచి నవద్వీప ప్రజలు ఆశ్చర్యపడిరి. విద్యార్థులకు పూర్వమువలె పాఠములు చెప్పుటలేదు. కేవలము భగవానుని గుణగానములనే చేయుచుండెను. గురుదేవునియందు జనించిన యీ మార్పు చూచి కొందరు విద్యార్థులు విద్యాలయము వదలిపోయిరి కొందరు ఆయనకు శిష్యులై ఆయనతో హరినామ సంకీర్తనములనే పాడుచుండిరి. ఆయన విద్యాలయమును ఎత్తివేసిరి. భగవానుని మహిమను కీర్తించుటయే యిప్పటినుండి ఆయన ప్రధానకర్తవ్యము ఈసమయములో ఆయన భగవద్భక్తిలో నిమగ్నుడై బాహ్యజ్ఞాన శూన్యుడయ్యెను. రాత్రింబవళ్ళు శ్రీకృష్ణనామ సంకీర్తనములు పాడుచు, ఏడ్చుచు, భక్తిలో నిమగ్నుడై కాలము గడపుచుండెను. అపుడపుడు ఆయన స్నేహితునితో "నేను చూచితిని, ఏమిచూచితినో వింటివా" అని నుడువుచుండువారు. స్నేహితుడు వినగోరుచుండువాడు, కాని భావావేశములో తన్మయుడై యుండుటచే మాట్లాడలేక పోయెడివారు. ఆయన ఆనందాశ్రువులను కార్చుచు మూర్ఛితుడై పడిపోవువాడు. అందరును ఆయనకు పరిచర్య చేయువారు. చాలా సేపటికి ఆయనకు తెలివివచ్చెడిది. జ్ఞానము కలిగినపిమ్మటకూడ ఆ తన్మయత్వము ఉండెడిది.

చైతన్యునికి యీ భావాంతరము యీశ్వరోపలబ్ధివలన కలిగినది. ఆయన తన దివ్యనేత్రములచేత తన ఆరాధ్యదేవతను సమక్షమున దర్శించువారు. తన ఆరాధ్యదేవతతో ఏకమై పోయినటుల భావించువారు, ఆనందములో నిమగ్నులై పోవువారు, ఆనందముచే మూర్ఛలు చుండువారు కాని ప్రజలకు తెలిసెడిది కాదు. నిమాయ్ పిచ్చివాడైవాడని అందరును తలంచువారు. శచీదేవి భయపడి వైద్యుని పిలిపించెను, వైద్యుడువచ్చి ఔషధములకు ఏర్పాటుగావించెను. నవద్వీపములో ప్రవీణుడును, విశిష్టవ్యక్తియునైన శ్రీవాసునికొరకు వార్తపంపబడెను. శ్రీవాసు ఏకాంతముగా చైతన్యుని దర్శించి మాట్లాడెను. రెండుగంటలు పిమ్మట శ్రీవాసు బయటికి వచ్చెను. "నిమాయ్‌కి పిచ్చిపట్టలేదు, దయ్యముపట్టలేదు, ఆయన కృష్ణభక్తిలో తన్మయుడైయుండి అట్లు ప్రవర్తించుచున్నాడని" శచీదేవికి చెప్పెను.

పిమ్మట శ్రీవాసుని ప్రాంగణమునందే ప్రతిదినము సంకీర్తనము జరుగుచుండెడిది. దేశదేశములనుండి ఈశ్వరభక్తులు వచ్చి అచ్చట సమావేశమగుచుందురు. అందరు ఏకమై భగవానుని నామసంకీర్తనము చేయుచుందురు. సంకీర్తనము చేయుచు క్షుత్పిపాసలను మరచిపోవుచుందురు. ఒకొక్కరోజున రాత్రి పవళ్లు మద్దెల, కరతాళములు మ్రోగుచుండెడివి, ఆవాద్యధ్వనులచేతను, మధురహరి నామముచేతను నవద్వీపమంతయు ప్రతిధ్వనించుచుండెడిది. సంకీర్తనముపాడుచు చైతన్యుడు నృత్యముచేయుచుండును.

తన్మయత్వములో మునిగిపోయి పగలు రాత్రులు అను భేదము కూడ మరచిపోవుచుందురు.

నవద్వీపములో కొందరు వ్యక్తులు చైతన్యదేవుని యీహరినామగానమును విషతుల్యముగా భావించువారు అనేకమంది చైతన్యుని శిష్యులగుటచే కొందరికి కంటకముగా ఉండెను. వారు నవాబువద్ద ఫిర్యాదు చేసిరి. సంకీర్తన ఆపి వేయమని నవాబుగారు ఆదేశించిరి.

కాని చైతన్యదేవు ఆనిషేధమును మన్నించలేదు. ఒకరోజున వందలకొలది శిష్యులను వెంటబెట్టుకుని గ్రామ వీధులలో సంకీర్తనము చేయుటకు బయలుదేరెను. వందల కొలది మృదంగములును, వందలకొలది కరతాళములు మ్రోగుచుండెను. తన్మయుడైన చైతన్యుడు, ఆయన శిష్య బృందము హరినామగానము చేయుచు వీధులలో తిరుగు చుండిరి. నవాబు చైతన్యదేవుని అపూర్వమూర్తిని చూచి, ఆయనలోగల ప్రబలమైన ఈశ్వరభక్తిని చూచి విస్మయ మొందెను. ఆయన మరల ఎట్టి ఆటంకము కలుగచేయలేదు చైతన్యదేవుడు, ఆయనభక్తులు అప్పటినుండి ఏయాటంకము లేక భగవానుని మహిమను కీర్తింప దొడగిరి.

నవద్వీపము హరినామమును ప్రచారముచేసి,నదియా అను పట్టణమును భక్తిలో ముంచివైచిరి హరినామప్రచా రము కేవలము యీనవద్వీపములో చేసినంతమాత్రమున

లాభము లేదని చైతన్యుడు గ్రహించెను. ఈనామమును భారతదేశమునందు సర్వత్ర ప్రచారము చేయవలయును. ఆకారణముచేత ఆయన సన్యాసియై గృహమును వదలి వెడలి పోయెను.

చైతన్యుడు నవద్వీపమునుండి కటోవా అను నగరము నకు పోయెను. అచ్చట కేశవభారతీ అను సన్యాసివద్ద సన్యాసధర్మములో దీక్షస్వీకరించెను. దీక్షస్వీకరించినపిమ్మట ఆయన పేరు శ్రీకృష్ణచైతన్యుడని మార్చుకొనెను. సన్యాసము అవలంబించిన పిమ్మట చైతన్యుడు సమస్త దక్షిణ భారతము సంచారము చేసెను. ఆయన ఎచ్చటికి పోయినను కృష్ణభక్తిని ప్రచారము చేసెను.

ఈశ్వరభక్తినిగురించి ఆయన ఏ ఉపన్యాసముల ద్వారా కూడ ప్రచారము చేయలేదు. ఆయనయందుగల భావావేశమునుగాంచి అనేకమంది తామంతట తామే వచ్చి ఆయన శిష్యులైరి. అందరు ఏకమై హరినామగానము చేయుచు నగరములలో గ్రామములలో సంచారము చేసిరి. పుష్పములలోని సువాసనలను గురించిగాని, చంద్రకిరణముల మాధుర్యమును గురించిగాని యితరులకు బోధింపవలసిన పని లేదు, అటులనే చైతన్యుడుకూడ తన భక్తి ధర్మమును ఎవరికిని బోధింపవలసిన పనిలేకపోయెను. చైతన్యదేవుని భక్తి ఆవేశమును ఈశ్వరప్రేమ మహిమను గాంచి కృష్ణనామము నందు ఎంత మాధుర్యము ఉన్నదోగదా, ఆపరమపురుషు

డగు భగవానుని మహిమను గ్రహింపగలిగిన యడల ఎట్టి ఆనందలోకములో ఉందుమోకదా” అని అందరును తలంచిరి. ఆ కారణము చేత వేలకొలది జనులు చైతన్యుని శిష్య బృందములో చేరిరి.

చైతన్యుని ధర్మములోగల ప్రధానలక్షణములు ప్రేమ తీవ్రత్వము, ఆయన యీ ప్రేమను, దీనత్వమును తన జీవితము ద్వారా చూపించెను.

చైతన్యుని యీ దీనత్వమును, సేవాభావమును దర్శించిన అద్వైతాచార్యభక్తుడు వైష్ణవమండలిలో చేరిపోయెను వారందరును ఏకమై మహా వైభవముతో నామసంకీర్తనమును ఆరంభించిరి. చైతన్యుని భక్తిప్రభావమువలన నవద్వీపము లోని వైష్ణవ మండలివారు ఆటంకములను అన్నిటిని అతిక్రమించి, నిషేధముల నన్నిటిని తిరస్కరించి దక్షిణ భారత దేశమునందంతటను ధర్మప్రచారమును విజయవంతముగా కొనసాగించిరి.

చైతన్యుడు తనను అవతారముగా ఎన్నడును వర్ణించుకొనలేదు, ఎవరేని అట్లు నుడివినయడల వారిపై కోపించి తిరస్కరించెను.

చైతన్యుని ఆవిర్భావమువలన వంగదేశ ధర్మసంఘములో నూతనమైన ఆశ్చర్యకరమైన మార్పు కలిగినది. ఆయన ఆవిర్భావము జాతిభేదము అస్పృశ్యత నిర్మూలనకు కారణభూతమాయెను. పూర్వాచార పరాయణత్వము ప్రబ

లియున్న యీ దేశములో ఆయన యీ మహాసందేశ మును ప్రచారము గావించెను—“ చండాలోపిద్విజః శ్రేష్ఠ హరిభక్తి పరాయణః ” ఆయన ఎట్టిజాతిభేదమును పాటింపక అందరికిని సమానముగా హరిభక్తిని వంచిపెట్టెను.

సంఘములో నిమ్నజాతివారిని, నీచజాతివారిని ఎందరినో తనశిష్యబృందములో చేర్చుకొని వంగదేశములో సాధారణ ప్రజలందరికిని, నిమ్నజాతి వారికిని ప్రథమమున చైతన్యుడే ధర్మాధికారము నొసంగెను, అందరును దేవుని సంతానమని చాటెను, హరిభక్తిగలవాడు ఏజాతివాడైనను బ్రాహ్మణోత్తముడే అని ప్రకటించెను. ఆయన ప్రేమప్రభావము వలన జాతిభేదబంధనము ఛిన్నమైపోయెను ఆయన ఆవిర్భావమువలన దేశమునకు ఎంతయో మేలు చేకూరెను. మానవునకు మానవునకు గల పరస్పర మైత్రీసంబంధమును చైతన్యుడు విశదీకరించి బోధించెను.

హిందువులను, మహమ్మదీయులను, అస్పృశ్యులను— అందరిని సమానముగా ఆయన ప్రేమబాహువులచేత కౌగలించుకొనెను. అందువలన సకలజాతులవారు ఆయన శిష్య బృందములో చేరిరి.

మహమ్మదీయుడైన హరిదాస చైతన్యుని శిష్యత్వ మును స్వీకరించెను. ఆయన సద్బ్రాహ్మణుల భోజనపాత్ర లోనే భుజించిరి.

హరిదాసు చనిపోయి నవుడు ఆయన కళేబరమును చైతన్యుడు భుజముపై వేసుకొని ఉన్మత్తునివలె నృత్యము చేయుచుండెను, ఆ కళేబరముయొక్క పాదధూళిని స్వీకరించమని భక్తులందరికి ఆదేశించెను.

బ్రాహ్మణ, చండాల, అను భేదములేక అందరికిని ఈశ్వరభక్తిని సంపాదించుకొనుటకు అధికారము గలదు. అస్పృశ్యుల హస్తములనుండి అన్నము భుజించినవారు, కృష్ణ భక్తిని, కృష్ణుని దర్శనమును పొందుదురు, మాదిగవాడు భక్తితో కృష్ణపూజగావించిన యెడల ఆయనకు కోటినమస్కారములు చేయుదునని చైతన్యుడు నుడివెను.

మహమ్మదీయులు అనేకులు ఆయన శిష్యులలో చేరిరి. చైతన్యుని జీవితము విశేషభక్తిపూర్ణమైనది. ఆయన ఉపదేశములు కూడ అత్యంత మనోహరమైనవి.

ఈ ప్రపంచములో ఉత్తమధర్మమును గురించి ఆయన ప్రియశిష్యునకు యిటులబోధించెను—" జీవులయందుదయ, నామసంకీర్తనములో రుచి భక్తులసేవ, యీ మూటిని మహత్తర ధర్మములుగా గ్రహింపవలయును".

జాతిభేదమును, అస్పృశ్యతను, ఖండించి ఆయన ప్రసాదించిన ఉపదేశములు మహత్తరమైనవి,

ఆయన ఉపదేశములు—

1 మానవుడు మానవుని సోదరుడు.

2 పరస్పరులలో అసహ్యభావము కూడదు.

3 జాతి, కులము, ధనము, కార్యములు ఇవన్నియు అర్థము లేనివి. ప్రేమలేనిది యీశ్వరుని పొందజాలము.

4 అస్పృశ్యులనే మానవులుగాని వస్తువులుగాని లేవు. మానవునిలో భేదాభేదములు లేవు. అందరును ఈశ్వరాంశ సంభూతులే.

5 క్రోధమును శమింప చేసుకొనుట మాహాత్మ్యమునకు లక్షణము.

6 పాపిని ఆలింగనా బద్ధునిచేసి పవిత్రవంతుని గావించుట లోనే హృదయములోని మహాత్మ్యము ప్రకాశించుచుండును.

7 ప్రపంచములో ధన, మాన, పదగౌరవములు క్షణభంగురమైనవి. ప్రపంచములో బ్రతికిఉన్నంతకాలము భక్తి, సేవ, ధర్మము, జ్ఞానము—వీటిద్వారా జీవితమును మాణిక్యమువలె మహోజ్వలము గావించుకొనుము.

8 భక్తి, విశ్వాసము దుర్లభమైన వస్తువులు కోటానుకోట్లు కార్య పరతంత్రులు ప్రపంచములో ఉన్నారు, వారిలో జ్ఞానులు అల్పము, అందులో భక్తులు అతిఅల్పము. భక్తి, విశ్వాసము కలిగియున్న వ్యక్తికి ఈశ్వరలబ్ధిసహజము. భక్తియే ముక్తికి మార్గము.

9 మానవుడు శాంతికొరకు తపించుచుండును. శాంతి తన హృదయములోనే ఉన్నదను సంగతి ఆతడు ఎరుగడు.
10 సంయమము, త్యాగము, భక్తి, విశ్వాసము, ఉన్నచోటనే యథార్థమైనశాంతియున్నది.

చైతన్యుని దీనత్వమును గురించిన ఉపదేశము—

" తృణముకంటె అల్పుడవని తలంచి నామసంకీర్తనము కావింపుము.

నిరభిమానివై యితరులకుమానమర్యాదలనొసంగుము.
వృక్షమువలె సహనశక్తిని కలిగియుండుము.
ఎవరిని నిందింపక జీవనయాత్ర గడపుకొనుము.
వృక్షమును నరికినను ఏమియునుడువక సహించును.
ఎండిపోయినను నీటిని కోరదు."

చైతన్యదేవుని ఉపదేశములు అమృతపూర్ణమైనవి, ఆయనయందుగల భగవత్ప్రేమకూడ ప్రగాఢమైనది, తన్మయత్వము అనిర్వాచనీయమైనది. ఆయనను సర్వదా నాకరులు కావలా కాయుచుండువారు. భగవత్ప్రేమలో తన్మయుడైనపుడు మూర్ఛితుడై పడిపోవువాడు. పూరిజగన్నాధుని దర్శింపవచ్చిన ఒక రమణీమణి జనసమ్మర్దమువలన మందిరములో ప్రవేశింప జాలకపోయెను. దేవదర్శనముకొరకు పరితపించుచుండెను, వ్యాకులపడుచుండెను, అట్టి తన్మయసమయములో చైతన్యుని భుజముపై ఒక కాలును, గరుడ

విగ్రహముతలపై మరియొకకాలును పెట్టి పైకెక్కి దేవదర్శనము చేసుకొనవలె అట్టి వ్యాకులత్వము నాలో లేదుగదా అని చైతన్యుడు విచారించెనని చెప్పుదురు.

దేవదర్శనము చేయునుద్దేశించిన వానికి బాహ్యజ్ఞానముండదు.

చైతన్యుని దేహాంతర ప్రాప్తి కూడ అద్భుతమైనది. అపూర్వమైనది, సముద్రతీరమునకు వాహ్యాళికి వెడలి యుండెను. ఆకాశమున నీలమేఘములు, సముద్రమున అనంత నీలసముద్రము—ఇవి చైతన్యునికి కృష్ణరూపము స్మరింపజేసెను. ఆ మహత్తర సముద్రమును కౌగలించుకొనబోయి ఆ అనంతసాగరమున లీనమై పోయెను. ఆ ప్రేమోన్మాదుని అనంత అమృతసదనమున హాయిగా నిదురించుచుండెను.



# 3 జాగాయ్ — మాధాయ్

—♦(o)♦—

ఒకానొక గ్రామములో ఇద్దరు దొంగలు ఉండిరి. భక్తాగ్రేసరుడైన చైతన్య దేవుని శిష్యగణములో ప్రధానులైన నిత్యానంద, హరిదాసు, భక్తులు ఒకరోజున యిటుల సంభాషించుకొనుచుండిరి.

ని— "నేను ఇకను సహించ లేకున్నాను, హరిదాసు"

హ— "నీవు సహించజాలనిది ఏమిటి ?

ని— జాగాయ్, మాధాయ్ సోదరులు యిద్దరు సర్వనాశనమైపోయినారు, త్రాగుబోతులై యిష్టానుసారముగా చరించుచున్నారు. ప్రజలపై గావించుచున్న దుష్కార్యములకు అంతులేదు. ఇట్టి ప్రవర్తనను సహింపగలమా ?

హ— సహింపక చేయునది ఏమున్నది ? నీవు ఏమి చేయగలవు ?

ని— వారిని సన్మార్గమునకు త్రిప్పుటకు ప్రయత్నించెదము. రమ్మని, మనము యిరువురము వారివద్దకుపోయి హరినామమును వినిపించెదము. పాపులు ఉద్ధరింపబడిన యెడల అంతకంటె ఘనకార్యము ఇంకేమున్నది ? మనము మన కర్తవ్యమును నెరవేర్చెదము. వారు మన మాట వినని యెడల మనము ఏమి చేయగలము ?

జాగాయ్, మాధాయ్ అను సోదరులు వంగదేశములో నదియా అను గ్రామనివాసులు, వారు బ్రాహ్మణ వంశములో జన్మించినను, పాపకార్యములు చేయుట, అసత్యములు పలుకుట, ఇతరులకు అపకారము చేయుట వారి దైనిక కార్యములు వారి ఆధీనములో కొందరు ముఠా దారులు ఉండిరి. వారి బలముచేత ప్రజలను అనేక విధముల హింసించు చుందురు. ప్రజల గృహములను కొల్లగొట్టుట, తగుల బెట్టుట, సమయము కనిపెట్టి ప్రజలను హత్యచేయుట వారి దైనిక కార్యములు. త్రాగుడు వలన సర్వదా మదోన్మత్తులై ఉండువారు.

నిత్యానంద, హరిదాసులు యిద్దరు సంప్రతించుకొని ఒక రోజున జాగాయ్, మాధాయ్‌ల వద్దకు వెళ్ళిరి. ఆసమయములో వారిద్దరు నిషాలో నిమగ్నులై యుండిరి. కండ్లు జవా పుష్పమువలె రక్తవర్ణము దాల్చిఉండెను.

నిత్యానంద వారిసమీపమునకు వెళ్లి యిటులనుడివెను. "మీ వద్ద మాదొక ప్రార్థన ఉన్నది. మీరు పాప కార్యములను విసర్జించుడు, సన్మార్గమునకు మరలుడు, హరి నామములు గానము చేయుడు"

సోదరులు యిద్దరు మొఖము చిట్లించుకొని జవాబు చెప్పిరి. "ఓహో, మాకు ఉపదేశించుటకు గొప్ప సాధు పురుషులు వచ్చినారే, మీ సాధు వేషములు అన్ని మావద్ద పనికిరావు. ఇచ్చటినుండి తిన్నగా తప్పించుకు పొండు"

నిత్యానంద, హరిదాసులు యిటుల నుడివిరి. "సోదరులారా, హరినామము గానము చేయుడు, హరినామమును కీర్తన చేయుడు"

జాగాయ్, మాధాయ్‌లు యిరువురు యీసారి మండిపడి— "ఓహో, అలానా, మీకు ప్రాణభయముకూడ లేదే, ఆ, ఏమి పొగరులా?" అనినుడివిరి.

నిత్యానంద, హరిదాసు— "సోదరులారా, కృష్ణనామమును భజింపుడు, శ్రీకృష్ణనామమును భజింపుడు."

మరల వాగుచున్నారా? ఈ సన్యాసి ముండాకొడుకులను పట్టుకొనుడు, శాశ్వతముగా వీరి రోగము కుదిర్చెదము" అని జాగాయి గర్జించుచు వచ్చి పైనబడెను.

నిత్యానంద. హరిదాసు ఉపాయాంతరములేక పారిపోయిరి. జాగాయ్, మాధాయ్‌లు పరుగిడిపోయి తలక్రిందుగా పడిపోయిరి.

హరిదాసు— ఏమి, నిత్యానందా, బుద్ధి వచ్చినదా? పాపులను ఉద్ధరించుటకు మరల పోదువా?

నిత్యానంద— నీవల్ల నే గదా యిది అంతయు జరినది? నీవు సలహాయిచ్చి నన్ను తీసుకుని వచ్చితివి, నన్ను అవమానపరచితివి?

హరిదాసు— అంతయు చేసినది నీవు, ఇప్పుడు నేరము నాపైన వేయుచున్నావా?

నిత్యా— మరల వెళ్ళెదము, ఇంతటితో అయిపోయినదా?

ఇద్దరు కలిసి చైతన్యునివద్దకు పోయిరి. నిత్యానంద— " చూడుస్వామి, సాధువులను సన్మార్గమునకు త్రిప్పుట అందరికిసాధ్యమైనదే, అసన్మార్గులను సన్మార్గమునకు త్రిప్పగలిగినవారు, పాపులను ధార్మికులనుగా చేయగలిగినవారు మహానుభావులు. నీవు అనేకమందిని నీభక్తులనుగా గావించుకొంటివి. హరినామములో ముంచివేసితివి, కాని జాగాయ్, మాధాయ్‌లను సాధువులనుగా చేయుము. వారికి హరినామమును వినిపింపుము, ఆపాపులను పుణ్యాత్ములనుగా గావింపుము, అప్పుడు నీశక్తి, దయఎట్టిదో గ్రహింప నగును. ఈకార్యము నీవుగాక మరెవరు చేయజాలరు.

చైతన్యుడు మందహాసముతో యిటుల నుడివెను— " మీరు యింతగా చెప్పుచున్నపుడు వారుఉద్ధరింపబడక పోదురా"?

జాగాయ్, మాధాయ్‌లు ఒక్కొకసారి ఒక్కొక గ్రామమునకు పోయి డేరావేసుకుని వసించుచుందురు. ఈసారి చైతన్యుని సమీపమున డేరావేసుకుని వసించుచుండిరి.

సాయంకాలమయినది. వారు కల్లుత్రాగి మత్తెక్కిపడియుండిరి. ఒకవైపున శ్రీవాస పండితుని గృహములో భజన జరుగుచుండెను. రాత్రివేళ భజన శబ్దములు వారి చెవిలో ప్రవేశించెను. భజన వినుటకై తూలుచు శ్రీవాసుని గృహమునకు పోయిరి. ద్వారము బంధింపబడి యుండెను,

లోపల ప్రవేశింపలేకపోయిరి, అందువలన బయట నిలువ బడియే పాటలు వినుచుండిరి. కాళ్లు వణుకుచుండెను, తల తిరిగిపోవుచుండెను. చెవులలో గుంయ్ మనుచుండెను, కంటికి అన్నియు అద్భుతముగా కనబడుచుండెను. పాటల విషయము వారు గ్రహింప లేకపోవుచుండిరి. అప్పుడప్పుడు వారికాళ్ళు పైకి ఎగురుచుండెను.

ఈవిధముగా రాత్రిగడచి పోయెను. తెల్లవారుచుండగా కీర్తన ముగిసిపోయెను. భక్తులు గంగాస్నానము చేయుటకు ద్వారము తెరచి బయటికి వచ్చి పోదలిపోయిరి, ఎదురుగా జాగాయ్, మాధాయ్ !

చైతన్యునకు "నిమాయ్" అను మరియొక పేరుగలదు ఆయన ఒకప్రక్కగా తొలగి పోవుచుండెను. జాగాయ్, మాధాయ్ ఆయన సమీపమునకు పోయి " ఏమోయ్, నిమాయ్ పండితా, మీరు రాత్రి ఇచ్చట భజన చేయుచుంటిరి. మీపాటలు విని మేము చాలా సంతోషించితిమి. మాగృహమునకు వచ్చి ఒకసారి భజన చేయవలయునని కోరిరి.

ఎవరు జవాబు చెప్పకనే గంగానది వైపునకు పరుగిడి పోయిరి.

సాయంకాలము కొందరు శిష్యులను వెంటబెట్టుకుని నిత్యానందం నిమాయ్ గృహమునకు ఏతెంచెను, జాగాయ్, మాధాయ్ ల విషయములో ఏదోఒక నిర్ణయము గావింపుడని ఆయనను కోరెను.

నిమాయ్ యిట్లు నుడివెను—

"మీ అందరికి కోరిక కలిగినది కనుక జాగాయ్, మాధాయ్ యీసారి తప్పక తరింతురు. సరె, ఒకపని చేయుడు భక్తులు అందరికి కబురు పంపుడు, అందరము కలిసి ఏకముగా భజన చేయుచు వారి గృహమునకు పోయెదము, వారికి హరినామము వినిపించెదము, యీనామమునకు ఎట్టి మహోత్తరమైన శక్తి గలదో చూపించెదము".

ఇంతకాలమునుండి బయట ఎచ్చట కీర్తన జరిగి యుండ లేదు, గృహములలో జరిగినది, కాని ఇతరులను ఎవరిని ప్రవేశింప నీయలేదు. అందువలన భక్తులు తప్ప ఇతరులు ఎవరును భజన వినలేదు. ఇదియే ప్రథమనగరసంకీర్తనము, కొందరు మద్దెళ్ళు తీసుకొనిరి, కొందరు కరతాళములను చేతబట్టిరి, కొందరు శంఖములను ధరించిరి. నిమాయ్ గృహమునుండి పాటలు పాడుకొనుచు బయలుదేరిరి, ముందు నిత్యానంద, ఆయన వెనుక అందరును ఉండిరి.

భజన శబ్దమువలన జాగాయ్, మాధాయీలకు మెలుకువకలిగెను. రాత్రిఅంతయు కల్లుత్రాగి మదోన్మత్తులై అల్లరి చేసియుండిరి. ఆకారణముచేత పగలు పరుండి నిద్రించుచుండిరి. నిద్రకు భంగము కలుగుటచేత విరక్తి చెందిరి. సేవకుని పిలిచి ఆ అల్లరి ఆపివేయమని ఆదేశించెను. కొంచెము శాంతముగా నిద్రపోవుటకూడా వీలులేకున్నది" అనెను.

సేవకుడు వరుగిడిపోయి భజన ఆపివేసెను. కాని ఎవరి మాట ఎవరు విందురు. భక్తులు యింకా బిగ్గరగా పాడ సాగిరి. వారు జాగాయ్, మాధాయ్ గృహ సమీపమునకు వచ్చిన కొలది యింకా బిగ్గరగా పాడజొచ్చిరి.

సేవకుడు భయపడుచు పోయి—"బాబూ, నిమాయ్ పండితుడు ఆయన భక్తులతో కలసి కీర్తనము పాడుకొనుచు వచ్చుచున్నారు. పాడవద్దని వారించితిని, నామాట ఎవరు వినలేదు." అనెను.

జాగాయ్, మాధాయ్ గర్జన చేయుచు "అటులనా, మామాట అనగా లక్ష్యము లేకుండా ఉన్నదా, ఈసారి వారి పనిపట్టెదను" అనెను.

కోపావేశముచేత యిద్దరి నేత్రములనుండి మంటలు మండుచున్నటుల ఉండెను. తత్క్షణమే పాటలుపాడుట ఆపి వేయుటకు పరుగిడిపోయిరి.

వారినిచూచి భక్తులు భయపడలేదు, యీసారి యింకను బిగ్గరగా కీర్తనములను పాడుచుండిరి, ఇంకను ఉత్సాహముతో నృత్యము చేయుచు పాడుచుండిరి. కోపావేశముచే వారు జ్ఞానశూన్యులైరి.

నిత్యానంద అందరికంటె ముందుఉండెను. జాగాయ్, మాధాయ్ ఆయన సమీపమునకు పోయిన వెంటనే కరుణారసభావముతో వారివైపు చూచుచుండెను, ఎడతెగని ధారగా కన్నీరు కారుచుండెను. ఆ దృశ్యము చూచినపుడు

రాయికూడ కరిగిపోవచ్చును, కాని జాగాయ్ మాధాయ్‌ల హృదయములు కరుగలేదు, వారి క్రోధము యింకను పెరిగిపోయెను. సంకీర్తనము యింకను జోరుగా జరుగుచుండెను. నిత్యానంద కన్నీరు కార్చుచు "ఒక్కసారి హరినామము కీర్తించుము, హరినామముచు ఒక్కసారి పాడుము" అనెను

ప్రేమావతారమూర్తి నిత్యానందుని కరుణదృష్టి కన్నీరు, ఉన్మత్తులై భక్తులతో కలిసిపాడుట, చూచిన పిమ్మట. జాగాయ్ మనస్సు కలవరపడెను, "హరిఅనుము" అని నిత్యానంద మరల నుడివిన వెంటనే జాగాయ్ "హరి" అనెను.

మాధాయ్ గర్జించుచు "ఖబర్దార్ జాగాయ్, మరల అంటివా నీరోగము కుదిర్చెదను. ఈ నితాయ్యే అన్నిటికి మూలము, ఏడిరోగము కుదిర్చినగాని నాకు మనశ్శాంతి కుదరదు" అనెను.

త్రోవప్రక్కనే పగిలిన కుండ ఒకటి పడియుండెను. మాధాయ్ కోపావేశముచేత ఆకుండ తీసుకుని నితాయ్ మొఖముమీద విసరికొట్టెను. తలపై గట్టిదెబ్బ తగిలెను. రక్తముకారు చుండెను, నితాయ్ ఆనందముతో నృత్యము చేయుచుండెను.

రక్తప్రవాహము చూచి అయినను మాధాయ్ మనస్సు కరుగలేదు. ఆతడు మరల నితాయ్‌ని కొట్టుటకు

చేయిపైకి ఎత్తగా జాగాయ్ ఆతని చేయిపట్టుకుని "ఛీ, మాధాయ్, ఎంతనీచపుపని చేయుచున్నావు, ఇట్టి భక్తుని హింసించి వీరత్వము చూపుచున్నావా ? దీనివలన నీకేమి లాభము" అనెను.

మాధాయ్‌కి ఆటంకము కలుగుటచే "జాగాయ్, నీతల కూడాతిరిగి పోయినదోయి" అనెను.

నితాయ్ ఆనందముతో నృత్యము చేయుచు "కుండ తోకొడితె కొట్టెవుగాని, ఒకసారి మధుర హరినామమును పాడుము" అనెను.

జగాయ్ హరినామమును జపించుచుండెను. ఆతని నేత్రములనుండియు కన్నీరు కారుచుండెను. నిత్యానందుని తలనుండి రక్తముకారుట చూచినపుడు ఆతడు గావించిన పాపకార్యములు తలపునకు వచ్చి అనుతాపము చెందెను. భక్తులతో ఆతడుకూడ బిగ్గరగా "హరిబాల్, హరిబాల్" అనుచు నత్యము చేయుచుండెను.

అతని వ్యవహారము చూచి మాధాయ్ తలకూడా తిరిగిపోయెను, నిషాదిగిపోయినది. "కొడితే కొట్టితివిగాని ఒకసారి హరినామమును భజింపుము"

అని చెప్పగలిగినవాడు మానవుడుగాడు, దైవసమానుడై ఉండవలెను. ఇట్టి దైవసమానుని కొట్టినందుకు ఆతనికి అధికదుఃఖము కలిగెను, మహాపావ విషయము ఆలోచించినపుడు సిగ్గుపడి పోయెను. నితాయ్‌తో ఏకమై ఆతడు

కూడ యీసారి " హరిబోల్, హరిబోల్, " అనినుడి వెను. నిత్యానందుడు ఆ సోదరులు యిద్దరిని కౌగలించు కొనెను. వారు ఆ క్రిందనము చేయుచు నిత్యానందుని పాద ములు గట్టిగా పట్టుకొనెను, క్షమాపణ ప్రార్థించుకొనెను.

నిత్యానంద — మీరు నిమాయ్ వద్ద క్షమాపణ కోరు కొనుడు, ఆయన క్షమించిన యెడల మీరు రక్షింపబడు దురు, ఆయన దయను యాచింపుడు, అని నుడివెను.

జాగాయ్ మాధాయ్ నిమాయ్ వద్దకు పోయి ఏడ్చుచు " ప్రభూ మేము మహాపాపులము, మేముచేయని పాపకార్య ములు లేవు, మాకు ఏగతిపట్టునో. అను విషయము ఒక్క నాడయినను మేముతలంపలేదు. మాకు మీచరణములకడ్డ ఆశ్రయము నీయవలెనని " వేడుకొనిరి.

నిమాయ్ — మీరు నిత్యానందుని వద్ద క్షమాపణ కోరుకొనుడు, మాధాయ్ ఆయనతలను పగులగొట్టినాడు గదా ఆయనతలనుండి రక్తము కారుచున్నది, అయినను మీకు ప్రేమభిక్ష పెట్టుటకు తొందరపడు చున్నారు, ఆయన చరణములపై పడి ఆశ్రయమును ప్రార్థింపుడు.

ఆ సోదరులు యిద్దరు నిత్యానందుని పాదములపై పడెను. కన్నీరు కార్చుచుండిరి. శరీరము అంతయు ధూళి మయమై యుండెను, భక్తులు వారిచుట్టూచేరి హరినామ

సంకీర్తనము పాడుచుండిరి. "హరిబోల్ హరిబోల్" అను ఆ సంకీర్తనములో సోదరులు యిద్దరు నిస్తేజులై పడియుండిరి.

అనేకులు అచ్చట గుమిగూడిరి. అందరును ఆశ్చర్యముతో చూచుచుండిరి. వారి పేరు చెప్పినంతనే అందరు హడలిపోవువారు, వారిని చూచినంతనే సందులలోపడి పారిపోవువారు. వారినిచూచిన యడల నోటినుండి మాటలేవచ్చెడివికావు, ఆ జాగాయ్ మాదాయ్‌లు నేడు ధూళిలో పడియున్నారు. కన్నీరు కాల్వలైనట్లుగా కార్చుచు, నిమాయ్, నిత్యానందుల ప్రేమ భిక్షను యాచించుచున్నారు. ఆహా! ఎట్టిమార్పు! భక్తునిమహిమ ఎంత మహత్తరమైనది, మహాపాపులైన జాగాయ్ మాధాయ్‌లు భక్తుల స్పర్శచేత నూతన మనుజులైరి.

నిత్యానందుడు వారిని క్షమించెను. జాగాయ్ మాధాయ్‌లకు పునర్జన్మ లభించెను.

నిమాయ్ అచ్చటలేరు, భక్తులతో గృహమునకు తిరిగివచ్చెను.

సాయంకాలమైనది. నిమాయ్ గుమ్మముపద్ద "ప్రభూ, ప్రభూ" అని ఎవరో పిలుచుచుండిరి.

కొందరుభక్తులు ద్వారము తెరచిచూచునరికి జాగాయ్ మాధాయ్‌లు నిలువబడి యుండిరి.

నిమాయ్ వారిని లోనికిఆహ్వానించెను. వారు ప్రవేశించిన వెంటనే ఆయన పాదములపైబడి నమస్కరించిరి.

నదీయాపట్టణములో వీరిని గురించి విశేషముగా చెప్పుకొనుచుండిరి. నిమిషములో ఎంతమహత్తరమైన పరివర్తనము;

వేలకొలది జనము అచ్చట సమావేశమైరి. హరినామమును పాడుచుండిరి. భక్తిరసములో మునిగిపోయిరి. ప్రేమ మంత్రము మహత్తరమైనది, బొగ్గువంటి హృదయము బంగారమగును, దొంగలు భక్తులగుదురు.



# 4 రవిదాస భక్తుడు

—(౦)—

ఉత్తర,దక్షిణ. భారతదేశమందనేకసాధువులు, భక్తులు హరిజన కులమునందు జన్మించియుండిరి. మధ్యయుగములో భారతీయ సాధనామందిరమునందు వారే యేకచ్ఛత్రాధిపత్యము వహించి విరాజిల్లిరి. వారి యాధ్యాత్మికైశ్వర్యమతులమైనది. ఈ యైశ్వర్యమును బొంద నభిలషించియే బ్రాహ్మణోత్తమ మహాగురువగు రామానందుఁడు తన జాతి గౌరవముఁ త్యజించెను దక్షిణదేశము నం దనేక భక్తాగ్రేసరులు జన్మించిరి, ఉత్తర హిందూ స్థానమునందుఁ గబీరు, రవిదాసు. దాదు, రజ్జవ మొదలగు ననేక నిమ్నజాతి భక్తాగ్రేసరు లుదయించిరి. వీరందఱును మహాసాధకులు. వీరందఱును సకలదేశవాసులకు గురువులు, అందుచేతఁ బ్రత్యేకముగా హరిజనుల నుద్ధరించవలె నను విషయ మతిధాంభికమైనది.

కబీరునినామము విననివారు హిందూదేశములో నుండరు. భారతదేశమునందు మధ్యయుగ మాయున వలననే రచింపఁపబడినది. మామూలుగా 'హీనవంశోద్భవు' లనఁబడు మహాపురుషులయొక్క సందేశములు లోకములో సకల యుగములందును, సకలదేశములందును నవనవాధ్యాత్మిక జ్యోతిని దానము చేయఁగలిగెను.

కబీరెవరి శిష్యులో రవిదాసుకూడ నామహాపురుషుఁడగు రామానందుని శిష్యుఁడే. రవిదాసుని నామ మనేకులకు సువిదితమై యుండవచ్చును, కాని యథార్థమగుపరిచయము ననేకు లెఱుఁగక యుండవచ్చును. ఇట్టిమహాసాధకుల జీవన వృత్తాంతము లెందుకు విపులముగా వ్రాయఁబడలేదని యొక సారి విచారించుచుండఁగా నొకరిట్లు నుడివిరి— "బురదలో నౌకను లాగినయెడల వెనుకవైపున చిహ్నములుండును, గభీరజలములో నౌకనీడ్చుకొని పోయినయెడల వెనుక నట్టి చిహ్నము లుండవు."

పంకమయ మార్గమందు రవిదాసుని సాధననౌక నడచియుండిన యెడల నాబురదయందు నేఁడుకూడా చిహ్నము లుండెడివి. దానినే మనమితిహాస మందుము. కాని యాయన సాధననౌక గభీరజలము నందవలీలగాఁ దెరనెత్తి నడచి యుండుటచే నచ్చట నట్టిచిహ్నములు లేవు. గొప్పగొప్ప హంతకుల చరిత్రలు మనము పఠించుచుందుము. యథార్థ మగు మానవసత్యతను నిర్మించిన వారిని గుఱించి మన యితి హాసమునందే ముండును ?

అందుచేతఁ గబీరు, రవిదాసు మొదలగు మహాసాధకుల యితివృత్తములు మనకు లభించుటలేదు. అయినను గబీరును గుఱించి యనేకులు వినియే యుందురు, కాని రవిదాసుయొక్క యాధ్యాత్మికైశ్వర్యమును గుఱించి యల్పుఁ సంఖ్యాకులేవిని యుందురు,

కబీరు స్వభావసాధకుఁడు. నీతిపథికులకు ( Ethical ) కర్మపరాయణులకు నియమిత కర్మమార్గము లవసరములు. ఆధ్యాత్మిక ( Spiritual ) సాధకులకు, భావకులకు ( Mystic ) నియమిత మార్గములతో నిమిత్తములేదు. కబీరీజాతిమానవుఁడు. ఆయనయొద్ద నన్నియు సహజములే. అందుచే మానవులకాయన "మార్గము చూపఁబోయి" చిక్కులలో పడువాఁడు. "భగవానునియొద్దకుఁ జేరుటకు మార్గమేది" యని కబీరు నొకరుప్రశ్నించిరి. "మార్గమనుమాట వలననే దూరత్వ మంగీకరింపఁ బడుచున్నది. ఆయనయందు నాయందు దూరత్వముండఁగలదా? ఆయన ప్రాణము, నేను ప్రాణిని. దూరత్వమెట్లుండఁగలనని" కబీరు జవాబిచ్చెను.

దూర్ అహైతో పంథభీ ఆహీ,
దూర్ నహీంతో పంథభీ నాహీ,

"దూరముండిననే మార్గముండును, దూరములేనిచో మార్గముండదు."

అందుచేతనే కబీరిటుల గానము చేసియుండెను.

పాని బీచ్ మీన సియాసీ
మోహి సునసున ఆవత హాసి.

"నీటిలోనున్న చేపకు దాహము వేయుచుండునఁట! వినివిని నాకు నవ్వు వచ్చుచుండును."

మార్గమును గుఱించి యెవరేని ప్రశ్నించుచున్నచో సాధకుండగు రవిదాసునొద్దకు శ్రద్ధతో వెళ్లుమని చెప్పెడివారు.

సంతనమె రవిదాస్ సంతహై
పంథ ఖబర్ సోహీ జానె,

" సాధకులలో రవిదాసు శ్రేష్ఠసాధకుండు. మార్గవిషయమై యాయనే యెఱుంగుదురు."

రవిదాసు ముండ్లను దొలంగించుకొని క్రమముగాం దన గంతవ్యమార్గము నందగ్రేసరుండాయెను. నైతికమార్గము నందు సంభవించునట్టి యనేక దుఃఖద్వంద్వములను గుఱించి యాయన యెఱుంగుదురు. మానవసేవయందును గార్యములందును నాయినకుం దీరికలేక యుండెను, అందుచే అనేకులకు సాధన మార్గములందు సంభవించిన దుఃఖములను దూరము చేసి యుత్సాహ పఱుపంగలిగెను.

రవిదాసుని సాధనలో మానవసేవ యొక గొప్ప విషయమై యుండెను. ఆరోజులలో సాధుసమ్మేళనము ప్రతిచోట జరుగుచుండెను. అచ్చటంకూడ మహత్తర తీర్థములలో, వృద్ధులు, రోగులు, శిశువులు మొదలగువారందఱి సేవయందాయన నిమగ్నులై యుండెడివారు. ఆయన హృదయ మెల్లపుడు యౌవనముతోం బరిపూర్ణమైయుండెడిది, అందుచే యువకులపై నాయనప్రభావ మప్రతిహతముగా నుండెను. యువకులను జెడంగొట్టుచున్నారని యనేకులు తలంచెడివారు.

కేవలము యువకుల నేగాక, ఆయన సాధనశక్తి రాజపుత్రి మహారాణులను సహా ప్రభావాన్వితులఁ గావించియుండెను. ఇతిహాసము నందున్నను లేకున్నను, మహా భక్తురాలగు మీరాబాయి కూడ రవిదాసుయొక్క శిష్యురాలనియే భక్తులలోఁ జిరకాలమునుండి వాడుకగలదు. ఆయన సాధన వలన మీరాబాయి నవజీవనము పొందియుండుట చేతనే 'రవిదాసును గురువుగాఁ బొందితి' యని యనేక సార్లు గానము చేసియుండెను.

రవిదాసును గురువుగా స్వీకరించుటకుముందు మీరాబాయి సాధన యాచార పరిచలితమైనట్టియు, శాస్త్రసమ్మతమయినట్టియు గిరిధర లాలీతో నారంభమాయెను, ఉత్తర కాలమందామె నీచజాతివాని సాధన నవలంబించెను, ఆయన సాధన శాస్త్రసమ్మత, వ్యక్త లింగాచార వ్యవహారములకు విరుద్ధమైనది. గిరిధర లాలీనే నమ్ముకొని యుండినచో కుల గురువును, బ్రాహ్మణ గురువును విడనాడి, యీవ్యక్త లింగాచార విరోధియగు నీచకులజాని చరణతలమున శిరమును వంచెడిదే గాదు. అందుచేతనే యామె శ్వశురగృహమును పితృగృహమును త్యజించవలసి వచ్చెను.

చిత్తోర్ మహారాణియగు ఝూలీయను నామె కూడ రవిదాసు శిష్యురాలయ్యెను. ఆమె యాయన చరణములకు మ్రొక్కుటగాంచి రాణితోనున్న బ్రాహ్మలందఱును వచ్చి రాజుగారికావార్త నెఱిఁగించిరి. రాజసభకు బ్రాహ్మ

ణులతో రవిదాసునుగూడఁ బిలిపించిరి. రానున్న యా పదను గ్రహించి రవిదాసిట్లు గానము చేసి యుండెను.

దేవాదిదేవ ఆయో తుమ శరణ
కృపా కీజియే జానా అపనాజనే,

"ఓ దేవాదిదేవా, నేను నీ శరణాగతుఁడను, నన్ను నీదాసునిగానెంచి నాపైఁ గృపజూపుము" దేవత రవిదాసుపైఁ బ్రిసన్నడాయెను.

భక్తిరసబోధిని యందిట్లు వ్రాయఁబడి యుండెను—రాణి యొక యుత్సవమున కేర్పాట్లు గావించి బ్రాహ్మణుల నందర నాహ్వానించెను. నీచమానవుని గురువుగా స్వీకరించిన వారియింట్ల భుజించుటెట్లని తెలంచి, ప్రతివారును బప్పు బియ్యము గైకొని స్వయంపాకము గావించుకొని భుజింప నారంభించిరి. ఇంతలో బ్రతియిద్దఱి బ్రాహ్మణుల మధ్య నొక్కొక్క నీచరవిదాసు కూర్చుండి యున్నటులఁ గాంచెను. ఇదిగాంచి గర్వమును విడనాడి దీనాలాపములతో బ్రాహ్మణులందఱు నాయన శిష్యులైరి. రవిదాసుకూడ భక్తి, శ్రద్ధ, మానవత్వములను మహత్తర విషయములనే ధరించి యుండెను.

రవిదాసు వయస్కుఁడయినను సాధుభక్తుల యెడల నెక్కువ భక్తిని జూపువాఁడు. భక్తి, సాధనలే యాయన

జీవితమునకు సర్వస్వము. అందుచే నాయన తండ్రి యీాయ
నను విడనాడెను. భార్యాసమేతుఁడై యాయన గ్రామాం
తమువెడలి చెప్పులను గుట్టుకొని బ్రతుకుచుండెను. ఆయన
దారిద్ర్యమునొక సాధువు గాంచి యాయన కొక స్వర్ణమణి
నియ్యఁగోరెను, దానిని జూరులోఁ బెట్టుమని రవిదాసాదేశిం
చెను. ఆసాధువు సంవత్సరాంతమున వచ్చి చూచినను రవి
దాసా దీనదరిద్రావస్థయందుండి చెప్పులు కుట్టుచుండెను. రవి
దాసు కొంతధన మార్జించి యొకధర్మసత్రమును నిర్మించెను.
ఆ సత్రమునందు సాధుసజ్జన సేవచేయువారు. దానియందొక
మందిరమును గూడ నిర్మించెను. రవిదాసు మాదిగ వాఁడ
య్యు మందిరమును నిర్మించి, దైవప్రతిష్ఠను గావించెనని
బ్రాహ్మణులు రాజుగారియొద్ద మొఱపెట్టుకొనిరి, రాజుగారు
కోపపడి రవిదాసును బిలిపించిరి కాని యాయనను దర్శించిన
వెంటనే రాజుగారు వినమ్రులై భక్తితో నాయనకుఁ బ్రణ
మిల్లి, గౌరవాదరమును జూపిపంపివేసిరి.

రవిదాసు సంప్రదాయాను సారముగా వ్రాయఁబడిన
చరిత్ర సహజమైనది, స్వాభావికమైనది. రవిదాసుయొక్క
యుపదేశ గ్రంథములందును నాయన జీవిత వృత్తాంతము
కొంత గాననగును. సాధనయందుఁ బ్రవీణుఁడయ్యు జోళ్ళు
కుట్టుకునియే బ్రతుకు వారు. ఈ విషయములోఁ గబీరుకూడ
నట్టి యభిప్రాయమునే కలిగియుండెను. కబీరు సాధకశ్రేష్ఠుఁ
డయ్యు బట్టలు నేయువాఁడు. ఎవరేని ప్రశ్నించినచో నిట్లు

నుడివెడువారు— "నీశరీరము శక్తి భగవానుని దానములు, ఈ శరీరశ్రమతో నన్నోపార్జన జేసినను నిదియు భగవానుని యన్నమే, కేవలము భిక్షాన్నమే యాయన దానమనుట సత్యముగాదు. నీవుబ్రతికి యుండునట్లును, నితరులకు సహాయ పడునట్లును బరిశ్రమ చేయుము.

ఏదైన ధజమును బొంది యాయన ధర్మశాలను నిర్మించెనో యది తనదేహశక్తి, పరిశ్రమ. ప్రతిదినమాయన పొందునట్టి స్వర్ణముద్రలాయన పంచేద్రియములు.

అందుచే నాయన చెప్పులు కుట్టువారు. మరమ్మతు చేయుమని యితరు లాయనయొద్దకుc జెప్పులను బంపువారు. దీని ద్వారమునసే యాయన సాధనయొక్క యాంతర్య విషయమును దెలియcజేసిరి.

ఏ స్పర్శమణియొక్క ధనముచే నాయన మందిరమును నిర్మించిరో యది భగవానుప్రేమస్పర్శ. ఈప్రేమ స్పర్శను గురించి యాయన యిట్లు నుడివియుండిరి—

'లోహాకంచన హిరణ హోయ్ కైసె
జవు పారస నహీ పరసై'

"హిరణ్య మాస్పర్శమణియొక్క స్పర్శను బొందకున్నచో, లోహము కాంచన మెట్లగును?

బ్రాహ్మణుల 'ఫిర్యాదు' వల్ల కాశ్మీర రాజాయనను బిలిపించెను. రవిదాసు మాదిగవాcడయ్యు మందిరమునందు

దేవప్రతిష్ఠను జేసిరని నుడివెను ఇది సత్యమాయని రాజ డిగినపుడు నిజమేనని పలికెను. నామందిరములో విశాలమైన విశ్వము, నీలాకాశము దాని గంబుజము. దేవత నాచర్మ ములో నిర్మింపబడినాఁడు, అతడు సజీవుఁడు, పరమపరి పూర్ణుడు "

నీలాకాశము గంబుజమైయున్న గగనమందిర తల మున మానవదేవతను గుఱించియే యాయన నుడివియుం డెను. రవిదాసు చిరకాలము మానవదేవతకు భక్తసేవ కుఁడై యుండెను.

ఆయన మాదిగ వంశమందు జన్మించినను, మానవ మాహాత్మ్యమును గ్రహించినపుడిట్లు గానము చేసెను—
" దుర్లభమగు నీమానవ జన్మను బుణ్యఫలముచేఁ బొందితిని. అవివేకముచే నదివృథా యైపోవుచున్నది. "

మానవుఁడే మోహావశుఁడై తనను దుఃఖార్తునిగను, దీనునిగను, శక్తిహీనునిగను, దలంచుచున్నాఁడు ? మాన వుడు " దివ్యస్వరూపి " (            ), " మానవుఁడాధ్యా త్మిక జీవి " (            ) మానవుఁడు " కమాల " పరమపరిపూర్ణుఁడు, ఆతని " దైన్య— దుఃఖముల " విచా రణ కేవలము మిథ్య.

నరపతి ఏకు సింఘాసని సోఇయా
సుపనె భయిఆ భిఖారి

ఆచత రాజ బిఛురత ముఖు పాయ్ యా
సోగతి భఈ హమారీ.

" మానవుఁడు లోకనరపతి, ఆతఁడు సింహాసనముపైఁ నుండి తాను భిక్షుకుఁడని స్వప్నమునందుఁ గాంచెను, రాజుగారున్నప్పటికిని భ్రమచే నాతఁడే దుఃఖమును బొందెను. నాకు నట్టి యవస్థయే సంభవించినది. "

మానవుఁడు తనమహిమను గ్రహింపఁ గలిగినవు, డాతఁడు విశ్వప్రకృతి యొద్దకేగిఁ యిట్లు నుడువును—" హే రస స్వరూపిణి, నా జీవనపాత్రను నింపివేయుము, ఆలోకములోఁ బరిపూర్ణమైన చంద్రసూర్యులను పాత్రల సమ్ముఖమునందుంచుకొని పానము చేయువారు మృత్యువును సహా నతిక్రమింతురు. "

కృత్రిమ సమాజబంధనముల యందుండి మానవుఁడు తనసహజ మహాత్మ్యమును మరచినాఁడు. అందుచేతనే రవిదాసు సహజాదర్శలోక విషయమై పలుమార్లు పల్కియున్నారు,—అచ్చట నెట్టిమిధ్యగాని, భేదముగాని, కృత్రిమహీనత్వత్తుగాని మానవుని క్షుద్రముగ నొనర్పలేదు.

" ఆనగరముపేరు బేగంపురము ( దుఃఖశోకాతీతమగు దేశము ) అచ్చట దఃఖము, దుర్గతి, యుద్వేగము, పీడనము, వైభవము, భయ భ్రాంతులుగాని యేమియులేవు.

నేనుత్తమ లోకమును బొందితిని, అచ్చట నిత్యకల్యాణము వసించుచుండును, ఆనగరము నందెవరు వసించినను, వారే నా మిత్రులని రవిదాసు ఘోషించెను.

మానవుని యందున్న దేవమాహాత్మ్యమునే రవిదాసు సర్వత్ర ఘోషింపఁజేసెను. అందుచే నాయన స్వర్గమునందమృతముగాని. యప్సరసులు, కిన్నరులుగాని, యేమియు లేదు సర్వబంధనముక్తమగు మానవసత్యమహిమ ప్రతిష్ఠితమై యున్నది. అందుచేతనే యాకాలపు యువకులేమి, రాణులేమి సర్వదుఃఖములను భరించి, యాయన సాధనమార్గమునే జీవనముల కాశ్రయముగా స్వీకరించిరి.

ఆయనకు శిష్యులనువారు లేకున్నను, నాయన యందనురాగముగల భక్తులనేకులుండిరి. వీరందఱును రవిదాసుని మతాను సారముగా నేకేశ్వరవాదులు. వేషభూషణముల యాడంబరముగాని, యాహారవ్యవహారముల యనాచారములుగాని, మద్యపానాదుల వ్యసనములు వారికుండెడివి గావు. స్వచ్ఛమగు వస్త్రములనే వీరుధరించువారు, మిథ్యావాక్యములుగాని, శపథగ్రహణములుగాని వీరికిఘృణ్యములు. ఏ జీవిని వీరుహింసింపరు. విగ్రహారాధనను వీరంగీకరింపరు, తమసాధన విషయమై గోప్యముగ నుందురు. సంధ్యాసమయమున నాలుబిడ్డలతో ధర్మమందిరము నందేకమైయియుపాసన గావింతురు. వీరిసాధనలో ప్రధానాంశములు — ఏకేశ్వరుని యందు విశ్వాసము, సత్యనిష్ఠ, నమ్రత, సరళత, భగవద్భక్తి,

యహింసమొదలగునవి పరనింద, లోభమోహములు, పరుషభాషణములు, వర్జనీయములు స్త్రీపురుషు లెవరును ద్వితీయవివాహ మాడరాదు, సాధకులు గృహస్థులుగా నుండవచ్చును, వారిలోనుచ్చ నీచభావము లుండగూడదు, వీరు శుభాశుభములు, తిథినక్షత్రములు నంగీకరింపరు " నిర్వాణవాణి " వీరి గ్రంథముయొక్క నామము.

ఈ సాధకులు మిక్కిలి శూరులును వీరులును. వీరి మతానుసారముగా మానవులే మహత్తరమైన తత్త్వములు. ఈమానవ మహిమను గుఱించిన విశ్వాస మాదిగురువు రవిదాసు నుండియే పొందియుండిరి.

ఆకాలమునందు సాంఘిక దురాచారములు ప్రబలియున్న యుగములో మాదిగ గృహమునందు జన్మించియు రవిదాసిట్టి మహత్తర మానవుడెట్లు కాఁగలిగెనో యాలోచించినచో నాశ్చర్యము కలుగకపోదు. ఆయన గృహస్థజీవితము జీవించెను, జాతీయవృత్తి వల్లనే తన జీవితయాత్రను నిర్వర్తించుకొనెను. అయినను మానవ మహిమ నేమాత్రము క్షుద్రము జేయలేదు.

నిర్భీకమైన సరళమైనసత్యధర్మావలంబియైన రవిదాసు మాదిగవాని గృహమునందు జన్మించినవాడని యందఱుఁ దేసినపుడాయన నడచుధర్మమార్గము కుసుమాస్తీర్ణమై యుండలేదు. పూర్వజన్మయం దాయనబ్రాహ్మణుఁడనియు, నీజన్మ

యందుకూడ నాయన దేహాంతరాళమునందు స్వర్ణమయ యజ్ఞోపవీతము గలదనియు నెన్నివిధము లాయనకు బోధించినను వినలేదు. ఆకాలపు సాంఘిక దురాచారములపై నాఘాతము వేయుటకే "నేను నీచజాతివాడ ననియు, నాది నీచ వంశమనియు, నాకులము నీచమయినదని సుం" బలుమార్లు నుడివి యుండెను.

ఈ కారణములచే నాయన యెన్నియో బాధలను సహింపవలసి వచ్చెను.

సంఘమునందున్న యీ నీచత్వము, హీనత్వముకంటె మానవమహిమ యెంతమహత్తరమైనదో ప్రదర్శింపఁగోరెను. అశుచుల నీచులని యెవరినందురు? ఆయన దీనహీనుఁడనని తలంచినకొలఁది భగవానుని బొందు నభిలాషయే ప్రబలమగుచుండెను

పారస జోహై లోహకూ
కృపాజో హై దీన హీన
హౌసయీ దీనహీన నహి,
రాఖుచరణే నిషదిన.

"పరశమణి లోహమును వెదకుచుండును, కృప దీనహీనులను వెదకుచుండును. హేప్రభూ, నావంటి దీనహీను లెవరును లేరు. అందుచే నన్నెల్లపుడు నీచరణముల యందుంచుము."

భగవానుని పూజయందు వినియోగించు వస్తువులన్ని యు నశుచియైనవే. ఆయన చరణ స్పర్శచే నన్నియు శుచి యగును.

దుధు తో బచరై అనహు బిటారిబ,
ఫూలు భంరి జలు మీని బిగారియొ,
మాఇ గోవింద పూజా కహా లై చరాబవు,
అరబు ఫూలు అనూహు నపాబవు
మైలా వేహై హై భుయ్ అంగా,

" స్తనమందున్న దుగ్ధమును దూడ యశుచిపఱచును, పుష్పమును భ్రమరమశుచిపఱచును, జలమును మీన మపవిత్రము చేయుచు, తల్లి, దేవుని నే పూలతోఁ బూజింపను? అనుపమమగు పూలు లభించుటలేదు. భుజంగము చందనతరువు నావరించి యుండును, విషము, నమృతము, నొక్కటిగా వసించుచుండును, "

ఈ విషమును, నమృతమును, సమానముగాఁ జూడఁ గలిగినాడు ఇదియే రవిదాసుని దివ్యదర్శనము. ఈ జీవితము నందే రక్తమాంసముల కామ, దివ్యభావము, హీనత, యుచ్చత యేకమై యున్నట్టులఁ గాంచెను.

ఆయన జన్మ నీచ చర్మకారుని కులమునందు, ఆయన అంతరమునందు, జన్మము బ్రహ్మధ్యానము. జీవితమునందీ

"చండాల - విప్రుల" సంయోగము సర్వత్ర వ్యాప్తమై యున్నది. ప్రతిమానవుని యందును రక్తమాంసముల కామన చండాలాకారములతోను, భాగవతభావము బ్రాహ్మణాకార ముతోను నున్నవి. ఈ "విప్రచండాల" సంయోగము లేని స్థానమేది ?

తను మను అరపవు పూజ చరాబవు
గురు పరసాది నిరంజను పాబవు.

" నా మనస్సును దనువును బూజార్ఘ్యములవలె సమ ర్పింతును, గురుప్రసాదముచే నానిరంజనుని బొందుదును."

పూజాద్రవ్యము లశుచియైనను భగవత్ప్రసాదముచే నవి పవిత్రములగును. ఆయన స్పర్శచేతనే తనువు కూడఁ బవిత్రమగును.

పావు పలి బలి జావు రమాయ్యా కారణె
కారణ కరణ అబోల్,

" ప్రియతము నుద్దేశించియే నేను పలుమార్లు నన్ను సమర్పించు కొనుచున్నాను, అది కారణాతీతమయినది, వచ నాతీతమయినది ఏ ప్రేమ కారణముచేత మానవుఁడు తన ననాయాసముగా సమర్పించు కొనునో, యాప్రేమనుగురించి నోటితో బ్రచారము చేయఁగలమా ? అది యెల్లపుడును "అబోలీ" అవాచ్యముగా నుండును.

రవిదాసెప్పుడును గర్వించలేదు, ఆతని కులము హీనమైనది. ఆయన సార్థకత యంతయుఁ బ్రియతముని స్పర్శ వల్లనే లభించినది.

తుమ చందన హామఇరండ బాపురె
సంగి తుమారె బాసా
నీచ రుఖతె ఊంచ భయేహై
గంధ సుగంధ నివాసా.

"నీవు చందనము, నేను దీనమగు హీనమగు నాముదము చెట్టును, అయినను నీతో నేను వసించుచున్నాను. అందుచే నీచవృక్షమునుండి యున్నత వృక్షమునైతిని, గంధ సుగంధములు నివసించు చున్నవి.

దరదు దేఖి సభకో హాసై ఒయిసీ దసామామారీ
అష్టాదశా సిద్ధి కరతలై సభకిృపా,

"నా దారిద్ర్యమునుజూచి యందఱు నవ్వుచుందురు. నా దురవస్థ యిట్టిది! అష్టాదశసిద్ధులు నాకరతల మందున్నవి, అంతయు నీ కృపయే గదా!"

భగవానుని గౌరవమునందే యాయన గౌరవము. భగవానుని ప్రేమతో నిపుడభిన్నుఁడు. మాదిగకులమున జన్మించినను నాయన యందొక బ్రహ్మమయ శక్తి గలదు,

అది యాయన చిత్తమునందెల్లపుడు జాగ్రితమై యున్నది. అచ్చటనే యాయనయు భగవానుడు నభిన్నులు.

తోహి మోహి మోహి తోహి అంతరకైసా ?

" నీకు నాకు, నాకు నీకు మధ్య భేదమెందుకు ? "

ఈ బ్రహ్మమయ శక్తి నను గ్రహించఁ గలిగిన యెడల సంసారమునందిక భయభ్రాంతులకు స్థానమేది ? అందు చేత రవిదా సేయాపదకు వెఱచువాడు కాఁడు.

కహో భఇవు జవు తను భఇబ ఛినుఛిను
ప్రేము జాఇ తవు భరపై తేరొజను.

" ఈ తనువు ఛిన్నభిన్నములైనను భయమేల ? ప్రేమ దూరమైపోయినచో నీ మానవుఁడు భయపడును. "

ప్రేమమయుని యందీ ప్రేమ వల్లనే తనను సంపూర్ణముగా నిమగ్నము జేసికొనినాఁడు. అందుచేతనే " రెండు " పోయి " ఒకటి " యైనది.

జబ్ హామ్ హోతె తవ తూ నాహి
అబ తూహి మై నాహీ.

" ' నేను ' ఉన్నపుడు ' నీవు ' లేవు; ఇపుడు ' నీవే ' విరాజిల్లుచున్నావు గనుక ' నేను ' లేను,

ఇట్టి ప్రేమసాధన కొఱకు రవిదాసు చేయని సాధన లేదు.

ధరౌ ధ్యాన అస సబ లయకారీ
మన పవన సబ జాయ హారీ
కహ రైదాస్ నిరంజన ధ్యావూఁ
అపార ఘరసౌ బహురిన ఆవూఁ.

"సర్వలయకారియగు ధ్యానమునే యవలంబింతుము యోగమాయన వైపునకే పరుగిడుచుండును.

ఆనిరంజనునే ధ్యానించినచో యపార గృహమునుండి తిరిగి రావలసిన పనిలేదని రవిదాసు నుడువుచున్నాఁడు."

కఠిన సాధనచే నాయన సర్వపాశములనుండి ముక్తుఁడై, ప్రేమపాశముతో భగవానుని బంధించెను.

జవు హమ బాంధి మోహ పాస్ హమ
ప్రేమ బాధని తుమ బాంధే।
అపనె ఛుటనకె జతన కరహు
హమ ఛూటె తుమ ఆరాధే।

"నేను మోహపాశములతో బంధింపఁబడినపుడు నిన్నుఁ బ్రేమ బంధనముతో బంధించితిని! ప్రేమమయా, నీవు ముక్తుఁడ వగుటకుఁ బ్రయాస పడుము! నిన్నారాధించి నేనిపుడు ముక్తుఁడను!"

ఆయన మధుర గానము లనేకులు పాడుచుందురు.

తుమన తోరహు తవు హమ నహింతోరహి
తుమ సివు తోరి కబన సివుజోరహిం ।
జవు తుమ గిరివర తవు హమ మోరా
జవు తుమ చంద తవు హమ భయెహై చకోరా ।
జవు తుమ దీపరా తవు హుమ బాతి
జవు తుమ తీరథ తవు హమ జాతి ।
సాచి ప్రీతిహామ తుమ సివు జోరి
తుమ సివు జోరి అవర సంగి తోరి ।
జహా జహా జావు తహా తేరీ సేవా
తుమ సోఠాకుర్ అవ్ రుసదేవా ।
తుమరె భజన కటహిం జమ ఫాసా
భగతి హేత గావై రవిదాసా ।

“ నీవు నన్ను వదలకున్నచో, నేను నిన్నెట్లు విడనాడగలను ? నిన్ను విడనాడి యెవరితో యోగయుక్తుండనుగాను ?

నీవు గిరివరమైనచో నేను మయూరమును నీవు చంద్రుండవైనచో నేను చకోరమును, నీవు దీపశిఖవైనచో నేను వత్తిని. నీవు తీర్థక్షేత్రమైనచో నేను యాత్రికుండను.

నీయందే నాసత్యప్రీతిని యుక్తము జేసితిని. నీయందు యుక్తుండ నగుటచేతనే నాబంధనములన్నియు ఛిన్నమైనవి.

నేనెచ్చటకుఁ బోయినను నచ్చటనే నీసేవ జరుగుచున్నది. నీవంటి ప్రభువు, నీవంటిదైవము మాకింకెవరు గలరు ? నీ భజన వలననే యమబంధనములు వీడిపోవును, భక్తిప్రేమల జయగానమును రవిదాసు పాడుచున్నాఁడు.

ఆయన యంతమురమునందున్న ప్రేమ వ్యాకులతయే యాయన సకల గానములలో నపూర్వముగా మూర్తీభవించెను.

పివు ప్రేమ సంగ కబహు నహిపాయో
బిథాకైసె బిసారి.

"ప్రియతముని ప్రేమసాంగత్యము నెప్పుడును బొందలేదను నీ బాధ నెట్లు మఱువఁగలను ?

కాసని బేదని ఆఖూ
హరిబిన జీవన న రహై కస రాఖూ
... ... ... ... ... ... ...
కహ రైదాస్ అందేసా యేహి
విన దరసన క్యో జివహి సనేహీ.

" యీ వేదన నెవరియొద్దఁ దెలియఁజేయుదు ? హరి వినా జీవితము రక్షింపఁబడు టెట్లో. ఆయనను దర్శింపక యీ ప్రేమాధీనుఁడు బ్రతుకు టెట్లు ?"

అందుచేతనే యాతఁడిట్లు వ్యాకుల ప్రార్థనగావించెను.

దరసన దీజై దరసన దీజై
దీజై దరసన బిలబన కీజై
దరసన తోరా జీవన మోరా
బిన దరసన క్యో దీజై చకోరా
తుమ బిన అబ సబ ఝూటీ ఆసా
సత సత భాషై జనరై దాసా ।

దర్శనమిమ్ము, దర్శనమిమ్ము, నీదర్శనమిమ్ము. ఇంక నాలస్యము చేయకుము, నీ దర్శనమే నాజీవనము, నీదర్శనము లేక యీ చకోరమెట్లు బ్రతుకఁగలదు ? నీవులేకసమస్తము మిథ్యయని రవిదాసు నుడువుచున్నాఁడు.

సకల యుగములయందును, భక్తులలో సాధకులలో నీ ప్రేమ వ్యాకులతయే యున్నటుల రవిదాసు గాంచెను.

తనప్రేమ వ్యాకులత్వము వల్లనే యాయన వారందఱితో తన సంబంధము ననుభవింపఁ గలిగెను. యోగీశ్వరుఁడగు మహాదేవుని యందు తపస్సునందే బహ్మ ప్రేమ వ్యాకులత్వమును గాంచెనో దానినే యిట్లు వ్యక్తీకరించెను—

సాయీ, తేరీప్రీత సమాధి లాగి ।
దహి అనంగ భసమ అంగ సంతత వైరాగి ।

అనలనైన, దీప్తవైన
ప్రేమ జటాధారీ ।

కోటికల్ప, ధ్యాన అల్ప
మదన అంతకారీ ।
పరమ తత్త్వ ధ్యాన మత్త
కోటి సూరజమాలా ।
ప్రేమమగన, నృత్య గగన
జేడి వహ్ని జ్వాలా ।
అస, మహేస, రుద్ర భేస
అజవాలు దరస ఆసా ।
కైసే సాయీ మిలో తోహి
గాఢై రైదాసా ।

" హే స్వామీ, నీ ప్రేమ సమాధియందు యుక్తుఁడై యోగీశ్వరుండు, మహేశ్వరుఁడనంగుని దహించి, శరీరమున భస్మము పూసుకొని శాశ్వత వైరాగ్యము నవలంబించెను. ఆ మదనాంతకుని నయనములయం దగ్ని జ్వాలించుచున్నది, ఆయన వదనమండలము దీప్తివంతమైనది, శిరముపై జటా భారము ధరించినారు. కోటికల్ప ధ్యానములు కూడ నాయన కత్యల్పములు.

ఆయన పరమ తత్త్వధ్యానమునందుఁ బ్రమత్తుఁడు, కోటిసూర్యమాలలాయన కంఠమున విరాజిల్లుచున్నవి, ప్రేమ మగ్నమగు నాయన నృత్యము గగనమునందెల్లపుడు జరుగు చున్నది, ఆ నృత్యముచే నావరింపఁబడి గగనమందంతటను వహ్నిజ్వాలలు వెలుఁగుచున్నవి.

ఇట్టి రుద్రవేషధారివగు నీదర్శనాశతో వ్యాకులపడు చున్నాఁడు. ఓ నా ప్రభూ, నీతో నేనెట్లు కలియఁగలనని రవిదాసు పాడుచున్నాఁడు."

కోటిసూర్య తారలతో విశ్వనిఖిలమునందాయనకు నిరంతరము హారతు లర్పింపఁ బడుచున్నటుల రవిదాసు దివ్య దృష్టితోఁ గాంచినాఁడు అనంత దేవతలయొక్క మందిరమునకుఁ దగినట్లుగానే యీ హారతి జరుగుచున్నది.

ఆరతి కహా లౌ జోవై
దేఖ మహారతి ఆచంద హెూవై
అనంత కంచన దీప జ్వాలై
జడ వైరాగ దృష్టిన ఆలై
కోటి భాను ఆవత సోహావై
కహా నిత ఆరతి అగ్ని పావై ।
అపార అంధేర అనంత భాన
నృత్త చతే నిత ఆరతి గాన ।
రైదాస ఆరతి దేఖై మహీ
జనమ మరణ భయ కఛు అవనాహీ,

"ఆయన హారతి నింకనెంతదూరము చూడను ? విశ్వము నందాయనకు జరుగుచున్న మహా హారతిని గాంచి విస్మయ మొందుచున్నాను ! కోటి కోటి కాంచన దీపముల ననంత మహాకాశము వెలిగించినది. జడ వైరాగ్య దృష్టి

యంతదూరమేగకున్నది! కోటి భానులతో నా యారతి శోభిలుచున్నది. ఆ యారతుల కెల్లపుడు దీపశిఖ లెచ్చట పొందునోగదా?

ఈ మహాహారతియందపారాంధకారము, ననంత సూర్యుండుc బ్రకాశించుచున్నటులc గాంచుము. ఆ యనసే మునియందనంత నృత్యము, హారతి గానములు జరుగుచున్నవి, రవిదాసు తనయంతరమునందీ మహాహారతిని గాంచుచున్నారు. జనన మరణ భయము లేవియు నిప్పుడులేవు."

రవిదాసుని యపూర్వగానములన్ని భక్తసాధకులలోc జాల వ్యాపించియున్నవి.

ఆజ వసన్త ఫూల ఫూల ఫూలె
వసన్త సబదిస।
తజి కృపానాయ్ సబ
భూవై ప్రేమి అహానిన।
ఆజు జాగు వ్యాకుల మనమేరె
మిలహు పేమ్రి సుహాగు
తరు వన సబ ఫూలతహై
వాగు పీతమ సంగ లాగు।
ఫికీ సూంఖీ ఆజ్ కఛు నాహీ
ఆజ్ సబరస ఉమంగ।
కహే ఉదాస రవిదాస ఆజదిన
లాగు లాగు పివ మంగ।

" నేఁడు వసంత కాలము పుష్పములతో నిండిపోయి నది, నలువైపులు వసంతమే. నేఁడు సమస్త కృపణత్వము విడనాడి యహర్నిశలా ప్రేమయందు నిమగ్నుఁడవు కమ్ము వ్యాకుల మొందుచున్న మనస్సా, నేఁడు మేల్కొనుము, ప్రేమస్పర్శవలన నాయనతో మిళితము కమ్ము వన వనాంతరమందున్న తరువులన్నియు నేఁడు పుష్పరాజులతోఁ బరిపూర్ణము. నేఁడు ప్రియతమునితో బ్రేమయోగమున మిళితము కమ్ము, నేఁడు నీరసత్వము, శుష్కత్వము లేదు, సకల రసములు ప్రవాహములవలెఁ బ్రవహించుచున్నవి. రవిదాసు, నీవిటుల నుదాసీనుఁడవై యుండుటేల ? ఇపుడే ప్రియతమునితో నేకముకమ్ము.



# 5 బుద్ధదేవుడు



నేపాలు రాజ్యమునగల కపిలవస్తు నగరములో శాక్య వంశమునందు విశ్వపూజ్యుడగు బుద్ధదేవుడు జన్మించెను. ఈయనయందుగల అసాధారణ ప్రతిభా ప్రభావమును, కామ క్రోధాదుల నివృత్తిని, అపారత్యాగమును గాంచి సమస్తప్రపంచము ఆశ్చర్యమొందెను. ఆయనయందుగల యిట్టి మహత్తర శక్తిసామర్థ్యములను గాంచి శాక్య వంశీయులు ఆయనకు శాక్యముని అనియు, శాక్యసింహుడు అనియు పేరులు పెట్టిరి. ప్రాచీన కాలమున, సూర్యవంశమునకు చెందిన ఇక్ష్వాకురాజవంశము నుండియే శాక్యవంశము ఉదయించెను. పూర్వకాలమున అయోధ్యానగరమున సుజాత అను పేరుగల ఇక్ష్వాకు వంశరాజు రాజ్యము చేయుచుండువారు. ఆయనకు ఒపుర. నిపుర, కరకండక, ఉల్కా- ముఖ, హస్తికశీర్ష, అను అయుదుగురు కుమారులును, శుద్ధా, విమలా, విజితా, జలా, జలీ అను అయిదుగురు కుమార్తెలును ఉండిరి.

సుజాతరాజు జెంతీ అను పేరుగల ఒక సుందరిని సతీమణిగా వరించెను, తత్ఫలితముగా జెంతీ గర్భమున 'జెంత' అను పేరుగల పుత్రుడు జన్మించెను. జెంతీ గర్భమున జన్మిం

చుటచే అతనిని అందరును జెంత అని పిలుచుచుండిరి. రాజు గారు ఒకనాడు సంతోష హృదయుడై ఏదేని వరమును కోరుకొమ్మని జెంతీకి తెలియ జేసెను. రాజుగారు నుడివిన ఆశావాక్యమును విని జెంతీ తనలో యిటుల తలంచెను—
" నేను రాజుగారి విలాసవతిని, రాజ్యమునందుగాని, పైతృక ధనమునందుగానీ, నాపుత్రునికి ఎట్టి అధికారము లేదు. రాజు గారి అనంతరము ఆయన పుత్రులే పితృరాజ్యమునకు అధి కారులు అగుచుందురు. అందువలన అటులగాక నాపుత్రునికి సర్వసుఖములు కలుగునటుల యేర్పాటు చేయవలయును. ఈ విధముగా అనేకవిధములైన ఆలోచనములను గావించి, తుదకు రాజుగారితో యిటుల నుడివెను— ' మహారాజా, మీ అయిదుగురు పుత్రులను వనమునకు తరిమివేసి నా పుత్రునకు రాజ్యమును దానము చేయుడు, ఇదియే నా కోరిక ' అనెను. జెంతీ కోరిన యీ వరమును విని రాజు గారు అత్యంత విచారగ్రస్తులైరి. ఆయన తన పుత్రులను అధికముగా ప్రేమించుచుండిరి. కాని జెంతీ కోరిన వరమును చెల్లించనిచో ప్రతిజ్ఞా భంగమగునని తలంచి 'అట్లేకానిమ్ము' అని జెంతీ కోరిన వరమును నెరవేర్చెను. ఈవరప్రదాన విషయమై నగరములో చిచ్చువలె వ్యాపించెను, రాజకుమా రులు వనమునకు పోవుదురని విని, నగరవాసులు అందరును వారితో కూడ వనవాసమునకు పోవుటకే నిర్ణయించుకొనిరి. ప్రజలందరును రాకుమారులతో బాటువనమునకు వెడలిపోయిరి.

వీరు కొంతకాలము కాశీ కౌశల రాజ్యమునందు వసించిరి, తుదకు హిమాలయ పర్వతముల సమీపమున రోహిణీ నదీతీరమునగల శాఖోట వనమునందున్న కపిలఋషి ఆశ్రమములో ప్రవేశించి అచ్చట వసించుచుండిరి. అచ్చట వారు మేన కోండ్రను వివాహము గావించుకొనిరి. సుజాత మహారాజు వర్తకులద్వారా యీ విషయములను తెలిసికొనెను, ఇట్టి వివాహములు ధర్మసంగతమైనవా కావా అను విషయము పురోహితులను, అమాత్యులను ప్రశ్నించెను. రాజకుమారులు ప్రస్తుత పరిస్థితులతో అట్టి వివాహములను గావించుకొనుట వారికి శక్యమైనది, అనగా సంగీతమైనది అని పండితులును, పురోహితులును ఏకవాక్యముతో నుడివిరి. బ్రాహ్మణులు అట్టి కార్యములను శక్యమైనవిగా తలంచుటచేతనే రాజకుమారులు అప్పటినుండి శాక్యులు అని పిలువబడుచుండిరి. ఈ విధముగా శాక్యవంశము ఆవిర్భవించెను.

శాక్యకుమారులు అనేకులతో కలసి శాఖోటవనములో కపిల ఋషీశ్వరుని ఆశ్రమమునందు కొంతకాలము వసించినపిమ్మట అచ్చటికి బహుజనము సమావేశమగుచుండిరి. ఆశాక్యకుమారులు ఋషీశ్వరుని అనుమతిని పొంది అచ్చట ఒక మహానగరమును నిర్మించిరి, కపిల ఋషీశ్వరుడు వారికి ఆశ్రయము యిచ్చుట చేతను, ఆయన ఆదేశానుసారముగా ఆ నగరము తయారగుటచేతను అది "కపిల వాస్తు" అని ప్రసిద్ధిజెందెను. శాక్యకుమారులలో ఒకర్

అను ఆయన జ్యేష్ఠుడు. ఆయనయే ఆ నగరమునకు రాజుగా గావింపబడిరి. ఆయన మరణానంతరము నిపుర్, కరకండక మొదలగువారు క్రమముగా రాజ్యమును పాలించిరి. సింహ హానునకు నలుగురు పుత్రులుండిరి—శుద్ధోధనుడు, ధేతోద నుడు, శుక్లోదనుడు, అమృతోదనుడు, అమితా అను ఒక కుమార్తెకూడ ఉండెను.

అమిత విశేష సౌందర్యవతియై యుండెను, కాని దుర దృష్టమున ఆమె కుష్టురోగముచే ఆక్రమింపబడెను, ఎన్ని ఔషధములు ఉపయోగించినను ఆరోగ్యము కలుగలేదు. క్రమముగా ఆమెశరీరమంతయు వ్రణములచే నిండిపోయి ప్రజలలో అసహ్యమునకు కారణమాయెను. అప్పుడు ఆమె సోదరులు ఆమెను బండిపైకి ఎక్కించి హిమాలయ పర్వత ములలో ఒక గుహావద్దకు తీసుకొనిపోయిరి. ఆచ్చట వివిధము లైన ఆహారములు, పానీయములు, శయ్య, కంబళులు ఆమెకు యిచ్చిరి, ఆమెను ఆ గుహలోనుంచి గుహాద్వార మును కర్రలతోను, మట్టితోను మూసివైచితిరి. వారు గృహమునకు తిరిగి వచ్చిరి. గుహాద్వారము మూసి యుం డుటవలన కలిగిన ఉష్ణము చేతనో, మరి ఏకారణముచేతనో ఆమె త్వరలో సంపూర్ణముగా ఆరోగ్యమును బడసి విశేష సౌందర్యముతో విరాజిల్లుచుండెను. మనిషివాసన పట్టిన ఒకపులి ఆగుహకు అడ్డు పెట్టబడిన మట్టిని త్రవ్వుచుండెను. ఈ గుహావద్ద కోలు అను ఒకఋషి వసించుచుండెను. ఆయన ఫలమూలాదుల కొరకు అచ్చటచ్చట తిరుగాడుచుండెను.

ఆ సమయములో యీ పులి ఆ గుహాద్వారమును త్రివ్వుట చూచి ఆశ్చర్యమొందెను. ఆయన సమీపమునకు వచ్చుటచే పులి భయముచేత పారిపోయెను. గుహకు అడ్డుపెట్టబడిన కర్రలను తొలగించి పరమసుందరియగు ఆ కన్యను గాంచి "నీవెవరవు" అని ఋషి ఆమెను అడిగెను. ఆమె జరిగిన వృత్తాంతమంతయు ఋషివరునకు తెలియజెసెను. ఆమె అపూర్వ సౌందర్యమును చూచిన ఋషివరునిమనస్సునందు అనురాగము ఉదయించెను. కర్రలలో దాగియున్న అగ్నివలె చిరబ్రహ్మచారియగు ఋషివరుని హృదయమునందును ఆసక్తి ప్రబలరూపము దాల్చెను. అందువలన శాక్య కన్యప్రలోభమున బడి రాజర్షి ధ్యానమునుండి జ్ఞానమునుండి భ్రష్టుడై గృహస్థ జీవితమునకు తత్పరుడాయెను.

రాజర్షి శాక్యకన్యను ఆదరముతో ఆహ్వానించి తన ఆశ్రమమునకు తోడ్కొనిపోయెను. ఈ రాజర్షి ఔరసమున శాక్యకన్యయగు అమిత గర్భమున 32 రు పుత్రులు జన్మించిరి పిల్లలు పెద్దవారైన పిమ్మట కపిలవాస్తు నగరమునకు పోయి రమ్మని వారికి ఆదేశించెను. వారి మాతామహుని వంశము మహత్తరమైన వంశము. ఫలానివారు నా తండ్రిగారనియు, మీకు మాతామహుడనియు, ఫలానివారు నా సోదరులనియు, వివరముగా తెలియజేసి, పుత్రుల విషయముకూడ వివరముగా తెలియజేసి కపిలవాస్తు నగరమునకు పంపెను. వారు కపిలవాస్తు నగరమున ప్రవేశించి తమ పరిచయమును తెలియజేసినపుడు శాక్యవంశీయులు వారికి సాదరముతో ఆతిథ్య

మిచ్చి విశేష ధనరత్నములనుసహా దానమొసంగిరి శాక్య కన్యలతో వారిలో కొందరికి వివాహములు కూడ జరిగెను. కుమారులు కోలుబుషి ఔరసమున పుట్టిన వారగుటచే వారి వంశము కౌలీయవంశము ” అని పేరు పొందెను.

కపిలవాస్తు నగరసమీపమున “ దేవదేహ ” అను గ్రామములో శాక్యవంశమునకు చెందిన సుభూతి అను ఒక ధనికుడు రాజుగానుండెను. కౌలీయ వంశమునకు చెందిన ఒక కన్యతో సుభూతికి వివాహము జరిగియుండెను. ఆమెకు మాయా, మహామాయ, అతిమాయ, అనంతమాయ, చులీయ, కోలీసోవా, మహా ప్రజావతి అను పేరులుగల ఏడుగురు కుమార్తెలు జన్మించిరి సింహహనురాజు మరణించిన పిమ్మట ఆయన పెద్దకుమారుడు శుద్ధోదనుడుకపిలవాస్తుసింహాసనమున కుఅధికారి ఆయెను. ఆయన దేవదహ రాజైనసుభూతియొక్క ప్రథమ కన్యయగు మాయను, కనిష్ఠకన్యయగు మహాప్రజావతిని వివాహము చేసుకొనెను. ఆశాక్యవంశీయుడగు “శుద్ధోదన” రాజు హారసమున, కోలువంశీయ భార్యయగు “మాయాదేవి ” గర్భమున యీ విశ్వపూజ్య మహాపురుషుడు జన్మించెను.

మహారాజు శుద్ధోదనుడు మాయాదేవియొక్క అపూర్వసౌందర్యమును గాంచి ఆనంద పరవశుడాయెను, ఆమెను విడిచి ఒక్కనిమిషమైనను ఉండువాడుకాడు. ఇట్టి సుగుణ సంపన్నశాలియగు భర్త లభించుటచే మాయాదేవి కూడ

సర్వదా ఆయన పాదసేవయందును, పరిచర్యయందును నిమగ్నమైయుండెడిది. శుద్ధోదన మహారాజుకూడ సర్వసుగుణశాలియగు భార్య అభిప్రాయములను గ్రహించువారు.

వివాహము జరిగిన పన్నెండుసంవత్సరములకు మాయాదేవి గర్భముధరించి క్రమముగా పూర్ణగర్భవతి ఆయెను. మాయాదేవి ఆసమయములో పితాలయమునకు పోవుచున్న సమయములో మార్గమధ్యమున లుంబినీ వనసౌందర్యమును గాంచి విశ్రమించుటకు అచ్చట కూరుచుండెను, ఇటుఅటు తిరిగి విశ్రమించుసమయములో ప్రసవ వేదనలు ఆరంభమాయెను. శుక్లపక్షపౌర్ణమి తిథియందు ఆ వృక్షముక్రిందనే యీ విశ్వపూజ్య మహాపురుషుని ప్రసవించెను. క్రైస్తవ శకాబ్దమునకు 500 ల సంవత్సరములకు పూర్వమే యీమహాపురుషుడు ఆవిర్భవించెను. ఈయన దశావతారముగా వర్ణింపబడిరి.

పుత్రుని ముఖదర్శనమువలన శుద్ధోదనునకు సర్వసిద్ధి లభించినటుల తలంచి తన కుమారునకు సర్వార్థసిద్ధుడు లేక సిద్ధార్థుడు అని నామకరణము గావించెను. సిద్ధార్థుడు జన్మించిన ఏడవరోజున మాయాదేవి మాయను త్యజించి పరలోకమునకేగెను. పిమ్మట సిద్ధార్థుని లాలనపాలన భారమంతయు ద్వితీయభార్యయగు మహాప్రజాపతిపై బడెను.

రాజా శుద్ధోదనుడు పుత్రుని జన్మదిన కార్యములు

అన్నియు నెరవేర్చెను. జోతిష్కులద్వారా పుత్రుని జాతక వివరములు వ్రాయించియుంచెను. తద్వారా ఆయన భావి జీవితముయొక్క అద్భుతపరిస్థితులను గ్రహించెను. ఆయన సంసారపరిత్యాగ విషయము గ్రహించి విశేషముగా విచారించి దానినుండి ఆయనను నివారించుటకు ప్రయత్నించెను.

ప్రపంచములో యీ మహాపురుషుడు జన్మించినపుడు ప్రపంచమున అనేకవిధములైన అద్భుత సంఘటనలు సంభవించెను. సమస్త ప్రపంచము అపూర్వజ్యోతితో ప్రకాశించుచుండెను, ప్రశాంత శీతల వాయువులు నలువైపుల వీచుచుండెను, దేవలోకమునుండి సంగీత లహరులు వచ్చి మర్త్యలోకమును ప్రతిధ్వనితము చేయుచుండెను. సిద్ధార్థుని రాకవలన సమస్త ప్రపంచము శాంతి సలిలములో తేలియాడుచుండెను. రాజకుమారునకు 'ఏమి అశుభము సంభవించునో' యని ఆయన చిత్త వినోదనమునకు. ఆయన సంతోషము కొరకు ఉద్యానవనములను నిర్మించెను, కాని భవితవ్యమును ఎవరు మార్చగలరు? రాజకుమారుడు రాజాజ్ఞను బడసి ఒకరోజున నగరమును చూచుటకు బయలుదేరినపుడు నగరములో వృద్ధులు, రోగులు, శవములు, సన్యాసులు కనుపించెను.

వృద్ధుని తెల్లనితల, కదలినపండ్లు, కృశించిన కాళ్లు చేతులు, వంగిన నడుము చూచి దీనికి కారణమేమని సారథిని ప్రశ్నించెను. అంత్యజీవితములో ప్రతిమానవుని దశ

యిటులనే ఉండునని గ్రహించెను. రోగిఅనుభవించేబాధలు పడే కష్టములు, అందరికిని సంభవించునని తెలిసికొని గృహమునకు తిరిగి వచ్చి ఆ విషయములను గురించియే ఆలోచించుచుండెను.

ఆయన మనస్సులో వైరాగ్యభావము కలిగెను—అంతయు మాయ యనియు, విలాసవైభవములు క్షణికమైనవనియు, సంసారము అసారమైనదనియు తలంచెను. ఆయన అనంత బ్రహ్మాండమును గురించి ఏమియు గ్రహింపజాలక పోయెను, సంసార కారాగారములో బంధింపబడి ఉన్నటుల తెలిసికొనెను. వైరాగ్యము బాహ్యాడంబరము కాదు, వైరాగ్యము యశస్సు కొరకుకాదు, అది మనస్సునకు సంబంధించిన విషయము. మహత్తరమైన అంతఃకరణమను సుక్షేత్రములో జ్ఞానవృక్షమునుండి ఫలించిన ఫలము వైరాగ్యము.

సంసారములో సమస్తము అనిత్యము, అస్థాయి అయినపుడు, తలిదండ్రులుగాని, భార్యాబిడ్డలుగాని, ధనధాన్యములుగాని వెంటరావు, ఇకను యీ మాయ యెందుకు, యీ స్నేహమెందుకు, సమస్తమును త్యజించి ఆ వైరాగ్య మార్గమును అవలంబింతును. ఆ సన్యాసివలె కాగలిగిన యెడల మనుజుని జీవితము సార్థకమగును. తండ్రిని, తల్లిని, బంధువులను, విషయవాంఛలను, భోగభాగ్యములను పరిత్యజించి ధర్మాలోచనములలో నిమగ్నుడయ్యెను, వివిధ విషయములను ఆలోచించి గృహస్థాశ్రమమును పరిత్యజించుటకే

సంకల్పించుకొనెను. సిద్ధార్థుని తీవ్రవైరాగ్యమును ఎవరు నిరోధించగలరు? ఆయనకు మహదైశ్వర్యములు ఉన్నను గృహములో నిలువలేకపోయెను. ఒకనాటి రాత్రివేళ తండ్రిని, భార్యను, బిడ్డను పరిత్యజించి సన్యాసివేషముతో బయలువెడలిపోయెను.

నిన్న రాజరాజేశ్వరుడుగా నున్నవాడు, నేడు స్వేచ్ఛాపూర్వకముగా ఐశ్వర్యమును, ప్రియతమ భార్యను, నవజాత శిశువును త్యజించి, సకల బంధనములను ఛిన్నము జేసి, సన్యాస ధర్మమును అవలంబించెను. పిమ్మట ఆయన అచ్చటచ్చట సంచరించి హరిద్వారమునకు ఉత్తర దిశయందున్న బదరికాశ్రమమునకు సమీపమునగల వైశాలీ నగరములో ప్రవేశించి రుద్రక అను ఋషివరునకు శిష్యుడగా చేరెను. ఆయనవద్ద శాస్త్రములు, యోగవిద్య, నేర్చుకుని ఐదుగురు శిష్యులతో గయ సమీపమునగల ఉరువిల్వగ్రామములో ప్రవేశించెను, అచ్చట ఆరు సంవత్సరములు కఠినతర తపస్సులో నిమగ్నుడై యుండెను. పిమ్మట కాశీ సమీపమునగల సారనాథకు పోయి ధర్మప్రచారము 'ఆరంభించెను, అనేకమంది శిష్యులను సంపాదించుకొనెను, మహారాజు బింబిసార, ఆయన ప్రజలుకూడ ఆ ధర్మములో, దీక్షను పుచ్చుకొనిరి, ఈవిధముగా అచిరకాలములోనే సిద్ధార్థుని నామము దేశదేశాంతరములలో వ్యాపించెను. సిద్ధార్థుడు సాధనలో సిద్ధిపొంది ఆత్మయొక్క స్వరూపమును దర్శించెను. ఆయన సుఖదుఃఖముల,

ఇంద్రియముల, వాసనల మార్గముల నతిక్రమించి బుద్ధత్వ మును పొందెను, సిద్ధార్థుడు "బుద్ధుడు" ఆయెను.

బుద్ధదేవుడు మగధదేశములో కొంతకాలముండి పితృదేవుని దర్శించుటకు కపిలవాస్తు నగరమునకు తిరిగి వచ్చెను, అచ్చట తండ్రిగారు నిర్మించిన మఠములో ఉండి అందరికిని ధర్మోపదేశములను, యోగవిద్యను నేర్పుటకు ఆరంభించెను. రాజగృహములోని వారును, సుగుణశాలినియగు తన భార్యయు ఆ ధర్మములో దీక్షను పొందెను.

ఆయన వర్షాకాలములో న్యగ్రోధ మఠమునందుండి, మిగిలిన ఎనిమిది నెలలు దేశదేశములు తిరిగి తన ధర్మము ప్రచారము చేయువారు. బౌద్ధ మతస్థులు యిటుల నుడువు చుందురు— "విశ్వప్రపంచము ముప్పది ఒక్క లోకములుగా విభజింపబడి ఉన్నది, ఈ లోకములు అన్నియు ఒకదాని పైన ఒకటి ఉన్నది. నరకము, ఆసురికము, ప్రేతము, పశు లోకము— అని నాలుగు దండనలోకములు—— అనగా యీ ముప్పదిఒక్క లోకములలో యీ నాలుగు లోకములయందే పాపులు శిక్ష ననుభవించుచుందురు. ఈ నాలుగు లోకము లకుపైన నరకలోకము, దానిపైన ఆరు స్వర్గములు ఉన్నవి. రూపనామము అను స్వర్గముపైన పదిఆరు లోకములు ఉన్నవి. ఈ స్థానమునందు ఉండువారే బ్రహ్మలోక వాసులని ప్రసిద్ధులు. వీరు అందరును నిష్పాపులు ఈ పదిఆరు రూప లోకములపై నాలుగు అరూపలోకములు ఉన్నవి. ఇంకా

కొంచెము ముందుకు పోయినచో ముక్తి లభించును. పైన
చెప్పబడిన ఆరు స్వర్గములలో నాలుగవ స్వర్గము పేరు తుషి
తము. బుద్ధుడు ప్రపంచమున జన్మించుటకు ముందు యీ
తుషిత స్వర్గములో వసించుచుండెను. ఈ ధర్మముయొక్క
మూల సిద్ధాంతములు పునర్జన్మవాదము, మనుజుని కర్మల
ఫలాఫలములు చూచి వారి జన్మల ఫలాఫలములు గ్రహించ
బడుచుండును. అనగా ఉత్తమకర్మలు ఆచరించిన యెడల
ఉత్తమ జన్మ, చెడుకార్యములు చేసిన యెడల చెడు జన్మ
లభించును. పూర్వజన్మకృత ఫలములన్నియు పుణ్యకార్య
ములచేత పవిత్రము చేయుకరకు మానవుడు యీ విధముగా
జన్మ మృత్యువులకు అధీనుడై ఉండవలసినదే నిర్వాణమే
మానవుని అంత్యదశ. నిర్వాణము పొందిన యెడల మాన
వులు జన్మమృత్యువులనుండి శాశ్వత ముక్తిని పొందుదురు.

బౌద్ధ మతస్థుల మతానుసారముగా బుద్ధదేవుడు 506
సారులు వివిధరూపములతో జన్మించి తుదకు బుద్ధుడయ్యె
నని నుడువుదురు. బౌద్ధధర్మముయొక్క మూలమంత్రము
"అహింసా పరమోధర్మః" ఆ కాలములో యజ్ఞములలో
పశువధ చేయుట గాంచుటచే బుద్ధుని కరుణార్ద్ర హృదయ
ములో దయాప్రవాహము ప్రవహించెను, ఆయన రాజ
పుత్రుడై యుండియు సకలభోగ విలాసములను త్యజించి,
జీవుల దుర్గతిని తొలగించుటకు సన్యాసియై, గ్రామములలోను
నగరములలోను దీనవేషముతో పర్యటించి అహింసా పరమ

ధర్మమును, నిర్వాణ ముక్తిమార్గమును ప్రచారముచేసి ప్రపంచములో ప్రసిద్ధిచెందెను.

బుద్ధదేవుడు బాల్యకాలమున వివిధశాస్త్రములలో పాండిత్యము సంపాదించెను, యౌవనారంభములోనే 19సంవత్సరముల వయస్సులో దండపాణి కన్య గోపా అను పేరుగల పరమసుందరియగు బాలికను వివాహము చేసుకొనెను.

కొంతకాలము గృహస్థధర్మమును నిర్వహించిరి. పిమ్మట ఇది క్షణభంగురమని, అనిత్యమని, అశాంతికి ఆలయమని గ్రహించెను, భోగభాగ్యములను త్యజించి, బంధు బాంధవులను విసర్జించి, 29 సంవత్సరముల వయస్సులో గృహమునువిడనాడిసన్యాసాశ్రమమునుస్వీకరించెను. పురవాసులు అందరును విచారించిరి. ఇంతకు కొలదిదినములకు పూర్వమే " రాహుల " అను పుత్రుడు జన్మించెను ఈ మహానుభావుడు వివిధస్థానములలో పర్యటించి, తుదకు గయలో యోగసాధన చేసిరి, అచ్చట మనస్సునకు తృప్తి కలుగలేదు. నిరాహారియై బహుకాలము ధ్యానములో నిమగ్నులై యుండిరి, పూర్ణానందములో పరిపూర్ణులై " అహింసాపరమోధర్మః " అను యీ మహాసత్యమును ప్రచారము చేసిరి, కాశీనగరమున సాలవృక్షచ్ఛాయక్రింద 80 సంవత్సరముల వయస్సులో నిర్వాణమును పొందిరి.

మగధరాజు అశోకుడు 257 వ శకములో యీ ధర్మములో దీక్షను పొంది 64000 వేల బౌద్ధప్రచారకుల భరణ

పోషణభారము వహించెను, 84000వేల స్థంభములను నిర్మించి బౌద్ధధర్మమహిమను కీర్తించెను. ఆకాలములో సింహాళిద్వీపమునుండి బర్మావరకును, భారతదేశమునుండి జావాద్వీపము, టిబెట్టు, మధ్య ఆసియా, చైనా, కొరియా, జాపాను, గ్రీస్, రోము మొదలగు దేశములవరకును బౌద్ధధర్మము విశేషముగా వ్యాపించెను.

శాక్యవంశ రాజకుటుంబమునకు చెంది వృక్షతలమున జన్మించెను, వృక్షముక్రిందనే సన్యాసధర్మమును అవలంబించెను, వృక్షముక్రిందనే నిర్వాణము పొందెను. జన్మనుండి దేహత్యాగమువరకు వృక్షతలమునే ఆశ్రయించి ప్రపంచములో నిర్వాణముక్తి మార్గమును చూపించెను ప్రపంచములో "ధర్మము" ఉన్నంతకాలము యీ మహాపురుషుని నామము శాశ్వతరూపము ధరించియుండును.



# కృతజ్ఞత



మ. రా. రా. శ్రీ శ్రీ కొండా శంకరయ్యగారు హైదరాబాదు రాష్ట్రమునకును, ఆంధ్రరాష్ట్రమునకును చిరకాల పరిచితులు. బహుగ్రంధ ప్రకాశకులు, ముద్రణాలయాధిపతులు, సదయహృదయులు, పరోపకార పరాయణులు, దైవభక్తులు.

వారి ముద్రణాలయమున పనిచేయుఉద్యోగుల హృదయమును సానుభూతితో, దయాదాక్షిణ్యములతో చూరగొని తమకార్యములను నెరవేర్చుకొనుచుందురు.

మా "శాంతినిలయ గ్రంథమాల" తరపునుండి చందాదారులకు యిచ్చుటకు "బాలసాహిత్యము" అనుపేరుతో 10 గ్రంథములను తయారుచేసితిని. ఈ 10 గ్రంథములను ముద్రించు విషయము వారితో ముచ్చటించితిని.

నేను అపరిచితుడననే విషయము పాటింపక, అడ్వాన్సు సొమ్మునైనను కోరక, నేను కోరిన వెంటనే వారు దయతో నా కోరికను మన్నించి అల్పకాలములో యీ 10 గ్రంథములను ముద్రించి యిచ్చినందుకు నేను వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతను నివేదించుకొనుచున్నాను.

ఇట్లు
ఆకురాతి చలమయ్య
కాకినాడ.

